

శ్రీ ఆకారపు నరసింగ గుప్తగారు



శ్రీ నరసింగ గుప్తగారి తండ్రి, తల్లి



శ్రీ ఆకారపు నరసింగగుప్తగారు వారిధర్మపత్నులు, సౌ. అనంతలక్ష్మమ్మ, సౌ. సుశీలమ్మ



మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు.

# ఏతద్గ్రంథ ముద్రణ ధనదాత ప్రశంస

సీ. జన్మించె నెవ్వాఁడు జగతి నాకౌరాఖ్య వంశపయోబ్ధి సుధాంశుఁడనగ
నిర్మించె నెవ్వాఁడు నిజధనంబు వ్యయించి లక్షలు విశ్వేశ్వరాలయంబు
స్థాపించె నెవ్వాఁడు శాస్త్ర వైదికగీత పాఠశాలల కళాభ్యాసకులకు
పెట్టించె నెవ్వాఁడు విద్యార్థులకు భోజనంబును మత భేదంబులేక
గీ. బహు మత గ్రంథములగూర్చి భక్తిమీర కాశి విశ్వేశ్వరుని పేర గ్రంథనిలయ
మెవఁడు నెలకొల్పె ఆనరసింగగుప్త కాయురారోగ్యము లొసంగుగాత శివుఁడు.

సీ. చెన్నబొమ్మనృపాలశేఖరుఁ మాదిరి వ్రాయించె బ్రహ్మసూత్రములవ్యాఖ్య
వేలరూప్యంబుల వెచ్చించి యావ్యాఖ్య ముద్రించె తనకీర్తి భువివెలుఁగ
మయువిధంబున ప్రజామండలి భ్రమజెంద కట్టించె సౌధంబు కాంతులీన
తండ్రి స్థాపించిన ధర్మసంస్థల నన్ని బాగుచేయించి దా బడసె పేరు
గీ. శివుని మహిమావిశేషంబు జెప్పునట్టి శైవసర్వస్వమును శంభుశతకములను
కాంచి ఖండంబు మొదలగు గ్రంథసమితి నెవఁడు ప్రచురించె నా నరసింగగుప్త
కామితంబుల నొనగూర్చుగాత శివుఁడు.

సీ. రాజమాంబాపాద రాజీవసేవతో పితృవాక్యపాలనన్ బేరుగాంచె
నిత్యంబు శివపూజ నిశ్చలభక్తితో సౌవర్ణపాత్రల సలుపుఁ గూర్మి
బుధుల దీనజనాళి పోషించు నిరతంబు తన్మనోరథముల దనియఁజేసి
ధరియించి భస్మరుద్రాక్షల శ్రద్ధతో నిష్టలింగార్చన మెలమిజేసి
గీ. పూజకాలంబునన్ రుద్ర పురుషసూక్తి శాంతిపాఠంబులంజెప్పు శైవులయిన
బ్రాహ్మణాళికి దానధర్మములతృప్తి నింపుచుండును మా నరసింగగుప్త.

చ. వినఁడు మహేశదూషణము, వీనులవిందుగ నెన్నదేవి దా
విను మహిమంబెగాని ఘనవిజ్ఞుల సూక్తులెగాని నెన్నడు
న్గనడు వినండు పామరుల గైతవభక్తి మహేశ్వరాళినిన్
గనిన క్షణంబె మ్రొక్కులిడు జ్ఞానికి గుప్తకు సాటి యాతడే.

ధర్మకార్యానురక్త చిత్తంబు గల్గినట్టి నరసింగగుప్త యనంతలక్ష్మి
సతి సుశీలయు సేవింప శర్వు భక్తిగల్గి యాచంద్రముగ గీర్తి గాంచుగాత.

శ్రీ శివాయగురవేనమః

# పీఠిక

ఈ నలవిలాస నాటకకర్త బ్ర. లో. ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. వీరి పాండితీ వైభవము కవితానైపుణ్యమును జగత్ప్రసిద్ధము. వీరీ నాటక రచనకుఁ బ్రధాన కారణము కలి నిర్మోచనమని వ్రాక్ప్రచ్చినారు.

ఇంపలి పోకడలు ప్రాచీన కవితల్లజుల నడుగుజాడలు. సంస్కృత కవులు వారి నాటకములందు పంచసంధులు సమన్వయ మొనరించినటుల శాస్త్రిగారు కూడ నిదివరలో ప్రకటించిన నలప్రవాసము నందును, ఈ నలవిలాసమునందును సాంగముగ పంచసంధుల సమకూర్చి యున్నారు.

'నలవిలాసమున' —— ప్రథమ ద్వితీయాంకములందు ముఖసంధ్యంగము లెటుల ప్రదర్శించ బడినవి. "పడయగరాని వస్తువును" అను పద్యమున పూర్వరాగ బీజమగు స్వప్నదర్శనము గలదు. "కావ్యార్థస్య సముత్పత్తి రుపక్షేప ఇతి స్మృతః" అను లక్షణము వలన ఉపక్షేపము గలదు. "తెలివి వెలుంగజేసి" అను చోట స్వప్నదర్శనము విస్తరింపబడియె గాన "సముత్పన్నార్థ బాహుళ్యం జ్ఞేయః పరికర పునః" అను లక్షణము వలన పరికరమను సంధ్యంగము "చంచలంబగు కనుగవ సౌష్ఠవంబు" అనుచోట స్వప్నదృష్టమునిర్ణయింపబడెనుగాన "తన్నిష్పత్తిఃపరిన్యాసః" అని పరిన్యాసము గలదు. "తపముల వల్లనైన" అనుచో నాయికాప్రాప్తి నిర్ణయింప బడియెగాన యుక్తి "సంప్రధారణ మర్థానాం యుక్తిః" "పడతి నినుజూతు నీ మేను వాడదు గద" అను పద్యమున కుతూహలముతో గూడిన వాక్కులు గలవు గాన పరిభావన, (కుతూహలోత్తరావాతః ప్రోక్తాతు పరిభావనా) "జగముల నెల్లెడం గలుగు చక్కదనంబుల ప్రోగు నిగ్గునన్" అనుచోట బీజార్థమునకు అంకురము గలదుగాన ఉద్భేదమును ముఖసంధ్యంగము.

——• తృతీయాంకమున ప్రతిముఖ సంధ్యంగములు •——

"కామందకుడు మహారాజు విదర్భజాయత్త చిత్తుడై" అనుచోట రతిభోగేచ్ఛ గలదుగాన విలాసముగలదు. (సమూహారతి భోగేచ్ఛా విలాస ఇతి కథ్యతె)నాయకుడు "ఎండగజేతు" అను పద్యమున "తాపమునోప నికేమి సేయుదున్" భైమిని గను నుపాయ మేమి? నిజముగా నిప్పని దుర్ఘటమే అనుచోట ఉపాయాభావము గలదు గాన తాపనము గలదు. (ఉపాయా దర్శనం యత్తు తాపనం నామ తద్భవేత్)

—• చతుర్థాంకమున గర్భసంధ్యంగములు •—

"నదియన నీరువారు"అను పద్యమున వితర్కము గలదు. "రూపం వాక్యం వితర్కవత్" చిక్కదనంబుతో నిడుపు జెందిన యీజడ జూడ నద్దియే" అనుచోట హేతువు గలదు గాన అనుమానము. "లింగామాహో అనుమానతః"

—• పంచమాంకమున విమర్శ సంధ్యంగములు •—

కలిచేతన్ మొలకెత్తి అను పద్యమున ఇష్టార్థమునకు విఘాతము గలదు గాన ప్రతి షేధము.

"ఈప్సితార్థ ప్రతీఘాతః ప్రతిషేధ ఇతీరితః"

"ఏ పుపుబోడితో నరస మింపున నాడుచు"అను పద్యమందు కష్టము కీర్తింప బడియెగాన ప్రసంగము.

"ప్రసంగో గురుకీర్తనం"

"మూఢుడు ప్రేలినంతనె ప్రమోదమె కాని" అనుచోట దోషము ప్రకటింప బడియె గాన అపవాదము గలదు. (దోష ప్రఖ్యాప వాదస్యాత్)

"దీమస మాశ్రయించి" అను పద్యమున ఉపసంహారార్థము గలదు గాన ప్రరోచన గలదు. (ప్రరోచనాచ విజ్ఞేయా సంహారార్థ ప్రదర్శినీ)

—• షష్ఠాంకమునందు నిర్వహణ సంధ్యంగములు •—

"నలుడు కన్యక నన్ను వరించునను నమ్మకమున్నను నాడెందము సందేహించు" అను చోటను–దమయంతి పెక్కు రాజులు గడచినను నిషధమహీపతి గానరాదయ్యేను." అను ప్రదేశమున బీజోపగమనము గలదు గాన సంధియను నిర్వహణ సంధ్యంగము.

దమయంతి (తనలో సంతసముతో) "పరమేశ్వరా ఇది నీయనుగ్రహఫలము" అనుచోట దుఃఖనివృత్తి గలదు గాన సమయ మనుసంధ్యంగము.

దమయంతి సూచిక సునుచును. పూదండ నలుని మెడయందే పడును. అనుచో అద్భుతము గలదుగాన ఉపగూహనము. (తద్భవే దుపగూహనం యత్స్యాదద్భుత సంప్రాప్తిః")

దిక్పతులు— నిషధేశా ! నీ డెందమున చింత విడువుము. అనుచో సామవచనము కలదు గావున భాషణము. (సామదానాది భాషణం)

నాయకుడు— మహాసముద్రము దాటితిమి. అనుచోట ఋష్టసిద్ధి యుండుటచే ఆనందము "ఆనందో వాంఛితాగమః"

రాజేంద్రా! నీ చేయు జన్మములయందు అనుచోట వరప్రదానము కలదు గావున కావ్యసంహారము. వరప్రదాన సంప్రాప్తిః కావ్యసంహార ఇష్యతే॥

"పుడమి చెలంగుగాత" అను పద్యమున నృపదేశాది శాంతి కలదుగాన ప్రశస్తి యను సంధ్యంగము. "నృపదేశాది శాంతిస్తు ప్రశస్తి రభిధీయతే". ఈ విధముగ సంధ్యంగములు సమన్వయించి వ్రాసిన నాటకము లతిస్వల్పములు.

రసవ్యక్తి మపేక్ష్యైషామంగానాం సన్నివేశనం నతుకేవల యా శాస్త్రప్రతిపాదనేచ్ఛయా॥ అను సూక్తి రసవ్యక్తి నినుమడింపజేయుటయే సంధ్యంగ సన్నివేశమునకు ఫలము.

—• కల్పనా చాతుర్యము •—

నలమహారాజునకు స్వప్నమున పితామహు నానతిచే భారతీదేవి దమయంతిని గన్పరచుటయు శారదాదేవియే లేఖవ్రాసి హంసచే బంపుటయు, సావిత్రీ సరస్వతుల సఖురాండ్రనుగా గల్పించుటయు, దమయంతి తన మనోహరుని వరించబోవునపుడు భాగవతమున పోతనమహాకవి రుక్మిణీదేవిని శ్రీకృష్ణ పరిణయముకంటె ముందు భవానీ దేవాలయమునకు పంపి నమస్కరింపజేసినటుల దేవ్యాలయమునకంపి అమ్మవారికి నమస్కరింపజేయుటయు మొదలగు విషయములు శాస్త్రిగారి యపూర్వ కల్పనా పటిమకు నికషోపలములై వెలయుచున్నవి. మఱియు "కృష్ణవర్మయును నీకీర్తి శాలియు గాక" "అతివ! కనుగొను మేర్పడ నితడ నబుకు" అను చోటను దిక్పాలకులను వర్ణించు పద్యములందును శ్లేషాలంకారము తదితర పద్యముల రూపకోత్ప్రేక్షాతిశయోక్త్యాదులు వర్ణితములు.

శాస్త్రిగారి కవితామాధుర్యము - పాండితీపటిమ - అద్భుతకల్పన ఈ క్రింది పద్యములందు గన్పట్టుచున్నవి.

ఉ. ప్రాహుణికేష్టపూరణము ప్రస్ఫుటమౌర్వికిణంబునైన నీ
బాహువుచేత గట్టుపడి పాకనిషూదన లక్ష్మి దైత్యసం
దోహము బ్రహ్మదత్తవర దుస్సహమై యెగలాగుచున్న లో
లేహయు దిర్వరాదు నడుగిప్పటికిం గదళింపజాలెనే.

ఉ. ఒక్కొకటె హిమాంశుకళ నొక్కొకప్రొద్దున బంచియానుచుణ్
జిక్కుచు బ్రాణముల్గతికచేర దపించెడి దేవకోట్లు నీ
యక్కటికంబునణ్ సతము యజ్ఞ హవిస్సులమెక్కి యల్ల మే
నొక్కటె బొజ్జగా దొరలుచుండిరి నేడు నరేంద్రచంద్రమా!

ఉ. ప్రీతిమనోజయాజి యల భీమసుతారణి రాజహంస వి
ఖ్యాత తదుత్తరారణియుగంబున బుట్టిన రాగపావకుం
నా తనువేది నిల్చెబసి నామది హవ్యముహోతయిందుడు
ద్గాతమధుండు ఋత్విజులు దక్షిణశైల జగంధవాహముల్ .

ఇంతియగాక యిందలి ప్రతిపద్యమున రసము చిప్పిలుచున్నది.

—› ముగింపు ‹—

ఇట్టి యుత్తమగ్రంథ ముద్రణకు వలయు ధనమును తాము చేసిన వాగ్దానప్రకారము సమర్పించి ముద్రింపించిన శివభక్తుడు మహారాజశ్రీ ఆకారపు నరసింగం గుప్త. వీరు, వ్రాయించిన పుస్తకములు ముద్రింపించిన గ్రంథము లనేకములు గలవు. వీరు లక్షలు వ్యయపరచి విశ్వేశ్వరాలయము గట్టించిరి. వేదశాస్త్ర పాఠశాలలను నెలకొల్పిరి. శివపూజా పరాకాష్ఠ కలిగి నిత్యము మహేశ్వర సేవాయత్తచిత్తులై వెలయు వీరికిని, వీరి కుటుంబమునకు నుమామహేశ్వరులు ఆయురారోగ్యంబులొసంగి సకల మనోరథంబుల బ్రసాదింత్రుగాత.

ఈమని }
6–7–48 }

ముదిగొండ వీరేశలింగశాస్త్రి
విద్యాప్రవీణ, విద్వాన్.

## —• ఇందువచ్చు పాత్రలు •—

| | | | |
|---|---|---|---|
| 1 | సూత్రధారుడు | | |
| 2 | పారిపార్శ్వకుడు | | |
| 3 | నలమహారాజు | .... | నిషధదేశరాజు (నాయకుడు) |
| 4 | చారాయణుడు | .... | విదూషకుడు |
| 5 | సత్యాచార్యుడు | .... | దైవజ్ఞుడు |
| 6 | కంచుకి | .... | అంతఃపుర సేవకుడు |
| 7 | బృహస్పతి | .... | దేవతల గురువు |
| 8 | విశ్వావసుడు | .... | గంధర్వుడు |
| 9 | మహేంద్రుడు | .... | దిక్పాలురు |
| 10 | అనలుడు | | |
| 11 | యముడు | | |
| 12 | వరుణుడు | | |
| 13 | బుద్ధిసాగరుడు | .... | నలమహారాజు సేవకులు |
| 14 | కామందకుడు | | |
| 15 | మాతలి | .... | ఇంద్రుని సారధి |
| 16 | దమయంతి | .... | విదర్భదేశపు రాజు కూతురు |
| 17 | భారతి | .... | దమయంతి సఖురాండ్రు |
| 18 | సావిత్రి | | |
| 19 | సరస్వతి | | |
| 20 | హంస | .... | లేఖాహారిణి |
| 21 | చంద్రకళ | .... | చేటికలు |
| 22 | వాసంతిక | | |
| 23 | సారంగిక | | |
| 24 | అనంగలత | | |
| 25 | చేటి | | |
| 26 | సేనాపతి | .... | నలుని సైన్యాధిపతి |
| 27 | వసుదేవుడు | .... | పురోహితుడు |
| 28 | కలావతి | .... | నలుని దాసి |

# తప్పొప్పుల పట్టిక

| | | | |
|---|---|---|---|
| 1 | 8 | నవ్విదు | నవ్విధు |
| 2 | 10 | కనివట్టితి | కనిపట్టితి |
| 4 | 12 | భ్రమమో | భ్రమమొ |
| 6 | 5 | నిలువుము | బిలువుము |
| 9 | 11 | మనుష్య | మనుష్య |
| 15 | 13 | తమ్మిచూని | తమ్మిచూలి |
| 16 | 11 | లావితం | లాలితం |
| 21 | 25 | కానియుట్టుల | కానటుల |
| 22 | 1 | గా | గావు |
| 28 | 26 | వల్కాగ | పల్కాగ |
| 30 | 11 | వతిరిత్త | వ్యతిరిక్త |
| 32 | 20 | వండగ | ఎండగ |
| 38 | 25 | బలరివు | బలరిపు |
| 40 | 8 | దవ్వక | దప్పక |
| 41 | 9 | జ్వలతా | జ్వలితా |
| 45 | 3 | గననేమి | గనవేమి |
| 47 | 7 | నీపు | నీవు |
| 49 | 14 | విన్ను | నిన్ను |
| 50 | 20 | నిర్లిపు | నిర్లిప్త |
| 51 | 9 | దూర్వ | ధూర్వ |
| 52 | 17 | నెదుర్కొను | నెదుర్కొను |
| 60 | 19 | వర్తయను | వర్తయును |
| 61 | 9 | కింపదేని | కి రుచింపదేని |
| ,, | 19 | దవురస్త్యుజండీళ | డు జడుం డితడింక |
| 62 | 15 | దధ | దద |
| 63 | 17 | విన్ను | నన్ను |
| 68 | 7 | సిధ్యది | సిధ్యతి |
| 69 | 10 | మనదళ | మదనదళ |

శ్రీ శివాభ్యాంనమః

# నలవిలాసము

## నాంది

చ. ధవు కనుదోయి మూసికొను దన్నిటలాక్షి సమీక్షితాంగయై
దివియుల నార్చి మూర్ధహిమదీధితి వెల్గున వ్యక్తగాత్రయై
తవులక వెన్క నొత్తిగిలి తత్కుచభాస్వనిపీడితోష్ఠయై
నవరతి నుబ్బు సిబ్బితి పెనంగొన నొప్పు భవాని ప్రోవుతన్.

ఉ. ఎవ్వనిఁ జెప్పినం బరఁగు నీశ్వరనామము సార్థకంబుగా
నెవ్వని యింతి కమ్మయన నింకొక నామము లేక యాఖ్యయా
నెవ్వని పట్టినే తెలుపు నిట్లు కుమారపదం బతుల్యుఁ డౌ
నవ్విదుఖండమండనుఁ డహర్నిశముం మిము నోముగావుతన్.

మ. తనకై యుగ్రముగాఁ దపించు క్షితిభృత్కన్యన్ మహేంద్రాదులే
ఘనులవ్వారి వరింపుమీ యనుచు నింకన్ నైజదోషంబులన్
దనరం బల్క తదంచిత ప్రతివచస్తంభీకృతుండైన యా
కనకక్ష్మాధర కార్ముకుం డొసఁగుతన్ గల్యాణముల్ మీకొగిన్.

( నాంద్యంతమునందు )

సూత్రధారుఁడు:- (అయిదాఱడుగులు నడచి పుష్పాంజలిచల్లి తెర వైపు జూచి) మారిషా! ఇటురమ్ము (ప్రవేశించి)

పారిపార్శ్వకుఁడు:- ఇదిగో వచ్చితిని.

సూత్ర:- రంగమంగళముల బాగుగా నొడఁగూర్చితివా!

పారి:- ఇప్పుడు పనియేమి!

సూత్ర:- (నవ్వి) తెనాలినగరమున శ్రీ రామలింగస్వామివారి కల్యాణోత్సవమును జూడ నరుదెంచిన సామాజికుల యాజ్ఞాక్షరములు వినలేదా!

పారి:- ఏమని?

సూత్ర:-

ఉ. తియ్యని పౌరసంబుల నతిక్తము సేయుచుఁ బల్కు మౌక్తికముల్
గుయ్యడ బల్కి గుంజుచును గొగ్గిగఁ బద్యములందు బొంగుచున్
దియ్యవివారి యేదనుచుఁ దృష్ణవహించెను మాదు వీనులన్
జయ్యనఁ గాల్చుచుండి రిది యోచితె వల్వరు కైత లల్లుచున్.

కాన నిప్పుడు నూతనమైన నాటకముఁ జూడ వేడుకపడు మమ్ము నభినందింపఁ జేయుటవలయు గాన

తే. గీ. చిత్ర మైనట్టిపోకడల్ సెలఁగునందు
విస్మయకరంబుగ రసము స్రవించు నెందు
సరసకవి యా బుధేంద్రుఁడు సలిపినట్టి
యద్భుతంబగు రూపకం బభినయింపు.

మని యానతిచ్చిరి.

పారి:- (నవ్వి) బాగుగానడిగితిరి సామాజికులారా! బాగుగా నడిగితిరి. ఇది లవణసముద్రమునకు జెఱకుపాలు గొనిరమ్మనుటె. ఈ కాలమున నట్టిరూపక మెందుఁ గలదు?

సూత్ర:- నిజమే అయిననట్టిదే నలవిలాస మని యొక్కటి గలదు.

పారి:- ఇద్దాని రచించిన వా రెవ్వరు?

సూత్ర:- తెనాలివాస్తవ్యుఁడగు ముదిగొండ నాగలింగారాధ్యుఁడు.

పారి:- ఈయన యింక నేవేని గ్రంథముల రచించి యుండెనా?

సూత్ర:- ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు నను నవి సుప్రసిద్ధములే గదా? వీని భాష్యములను వాని వ్యాఖ్యానములను గూడ

యన్నిటిని సమగ్రముగా విమర్శించి వేదపథము, వ్యాసపథము అని రెండు భాగములు కూడి యెడమ ప్రక్క దారులు గల బ్రహ్మపథ మను గొప్ప ప్రబంధము నేగాక సిద్ధాంతాఽధికారి సాధన జగత్ బ్రహ్మ జీవ గతి ముక్తులను పదార్థములను గూర్చి సకల వేదాంత గ్రంథములను విమర్శించి, నిగమాంతార్థ నిష్కృష్ట నిష్కహారమను నామాంతరముగల వేదాంతార్థపరిష్కార తారహారమను గొప్ప నిబంధమునుగూడ రచించి యీరెండు గ్రంథములను దేవనాగరలిపిని ముద్రింపించి సకలదేశ పండితవర్యుల నభినందింపఁ జేసెను.

పారి:- ఈయన తెనుఁగుబాస నేదైన రచియించి యుండెనా?

సూత్ర:- ఆయన కాదంబరి మొదలుగా ననేక గ్రంథముల నాంధ్రీకరించి యుండెఁ గదా!

పారి:- ఈయనకు నీకృతి నిర్మాణమున నాసక్తి యేలకలిగెను?

సూత్ర:- ముముక్షులకు నుపయోగించునట్లు లనాదిమల విమోచకమగు బ్రహ్మపథాది వేదాంతగ్రంథజాతము నిర్మించిన విధముననే బుభుక్షులకు నుపయోగించునట్లు గలిమల నిర్మోచకమగు పుణ్యశ్లోక చరిత నిర్మాణ మావశ్యకమని తోఁచుటచేఁ గలిగెను.

తే. గీ. నలుని దమయంతిఁ గర్కోటనాగ విభుని
వరుస ఋతుపర్ణ రాజర్షి వర్యుఁ దలఁప
తూలజాలంబు సురగాలిఁ దూలునట్లు
గలి వలన గలుగు నిడుములు దొలఁగు నిజము.

అని కవియే ఇద్దాని ఫలితమును నలప్రవాసమున నుడివి యుండెను. ఈ యర్థమున-

శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్.

అను మహాభారత సంహిత వ్యక్తము సేయుచున్నది.

పారి:- అటులేని సన్నియు బాగుగా సమకూడెను.

తే. గీ. కవి ప్రసిద్ధుఁడు గాథయో కలిహారణము
నటనమున యందు మనమతి పటుమతులము
సహృదయ జనాత్త శోభయు సభయు నిట్లు
గుణము లన్నియు నొడఁగూడెఁ గొదవ యేమి.

కాని యిట్టి మన పెంపును ఖలలోకము సహించునా ?

సూత్ర:- వార లోర్వనీ. ఓర్వకపోనీ, వారితో మన కేమి !

చ. అలసు లొమ్మెయెడనోవ కెంతయు నసూయాయత్త చిత్తంబులన్
బలు సద్గుణుల నవ్వుడవ్వ డెయిదన్ బాధించినన్ ధీరుఁడౌ
నల భూపాలునకున్ విదర్భవిభు కన్యాప్రాప్తి చందంబునన్
గలుగుఁదప్పక కీర్తిలక్ష్మి మనకింకన్ సందియం బేటికిన్.

పారి:- నలునికథ నెదిమొదలుకొని యభినయింప వలయు ?

సూత్ర:- భగవానుఁడగు పితామహుఁడు రాజర్షి యగు నిషధనాథు నకు సమానము లయిన రూప కులశీలములు గల దమయంతిని గూర్పను నామెయందు ధర్మగుణధురీణుండును నిందుకులాభరణంబునగు నింద్రసేనునిఁ గలిగింపను బూని యప్పని నెఱవేర్పుమని భారతీదేవి కానతియ్యఁగా నద్దేవియె నలునిచిత్తము మన్మథాయత్తము గావింప నెంచి యా యనఘునకుఁ గలలో విదర్భరాజకన్యను గనబరిచెను. (అని చెప్పుచు నెదురఁజూచి) నాతమ్ముఁడు రంగశేఖరుఁడు రూపకాఽభినయమున నప్రతిముఁడు. ఇతఁడు నేఁదలంచినట్లుగలగన్నది మొదలుకొని తహతహతో రాజలోకమును బంచి విదూషకునితో మాత్రము బునుపుచ్చుకొని నైషధుని వేషముదాల్చి రంగమండపము ప్రవేశించుచున్నాఁడు. తరువాతిపాత్రముల నిర్వహింప వలయుఁగాన మనము పోవుదము (అనిపోవుదురు)

ఇది ప్రస్తావన

శ్రీ శివాభ్యాంనమః

# నలవిలాసము

## ప్రథమాంకము

అంత, మదనావస్థతోనొప్పు రాజు విదూషకునితోఁగూడఁ బ్రవేశించును.

రాజు:-

చ. పడయఁగరాని వస్తువును బందును దర్పణమందుఁ జూపు కై
వడి మెఱయించి యెట్టివలవంతయు లేని మదిం దురాశ నా
నొడిసెలఁ గూర్చివై చితివి యూపున దవ్వున నేమిసామి కా
ముఁడ యిదివిద్దెయో చెడుగుబుద్ధియో శూరతయో వచింపుమా;

విదూష:- మహారాజునకు జయ మగుగాక !

రాజు:- వినన ట్లు తిరుగ నా పద్యమునే చదువుచున్నాఁడు

విదూ:- (తనలో) మహారాజునకు నేదియో గొప్పవిచారము గల్గి యున్నది.

రాజు:- (చూచి) మిత్రుఁడా ; దగ్గఱకు రమ్ము.

విదూ:- (సంతసముతో) ఆఁకలిగొన్నవానివలె నున్నాఁడ వేల ?

రాజు:- (ప్రకాశముగా) ఎండలో వేటాడినకతన

విదూ:- ఎండ తాఁకునఁగలిగిన సంతాపము మన్మథ దూషణమున శాంతించునా ?

రాజు:- (తనలో) నా ధోరణి నీ వికటవాది వినినట్లెయున్నాఁడు. నా యుదంతము నీతనికి వినిపింతునా (ప్రకాశముగా) నలుదెసలఁ జూచి వెచ్చనూర్చి, విందువుగాక.

ఉ. చింతలకెల్ల కామితము సిద్ధి యొసంగుట కానివేళ నే
కాంత సుహృజ్జనంబు చెవి కప్పనసేయుట మాన్పు దారి లే
దింతటికన్న నిక్కతన నిష్ఠ మదీయ మనోవ్యథావిధం
బెంతయు వీనికిం దెలుపుటే యుచితంబని నిశ్చయించెదన్.

మిత్రమా! చారాయణా! నీవు గార్యజ్ఞుఁడవు, రహస్యము వెలిబుచ్చనివాఁడవును గాన నీకు నిక్కముగా నాచిత్తక్షోభము నెఱిఁగింతును.

చ. తెలివి వెలుంగు పేరడిచి ధీరతపట్టును గొట్టివైచి నా
తలఁపును గాఱుచీఁకటి పథఃపతితంబును జేసి నొక్కఁగా
దలఁచి సమస్తదుష్కృతుల దక్షుమునౌ తనదైనమాయనే
కలికి నొనర్చి నాకుఁ గలఁ గన్పఱచెన్ మదనుండు నిర్దయన్.

కామశాస్త్రాధిదేవతయై ప్రణయ లజ్జాభరంబున నన్నుఁ గాంచు నక్కాంచనాంగిం గనుచుండునంతలో నభాగ్యుఁడనగు నేను వందిమాగధులు వేకువవేళ గావించు స్తుతిపాఠ కోలాహలంబుచే మేలుకువనొందితి.

విదూ:- (తనలో) వేకువ వేళ గనఁబడిన కల నిక్కముగా ఫలింపఁ గలదు. అయినను గొంచె ముడికింతముగాక. (ప్రకాశముగా) మిత్రమా! కనిపట్టితి.

రాజు:- ఏమది?

విదూ:- ప్రభాతమున ముందుగా మేలుకొనిన దేవియే నిద్రావ్యాకుల నయనుండవగు నీకు మన్మథ మాయగాఁ బరిణమించెను.

రాజు:- మూర్ఖుఁడా! కడమసందర్భము విన వైతివి.

విదూ:- చెప్పుము, చెప్పుము. అవధానముతో నున్నాఁడ.

రాజు:- అంత మేల్కాంచియుఁ గన్నులకుఁ గనబడుచున్నదానింబలె నా లలననే భావించుచు మదనునిచేఁ బారవశ్యము నొందింపబడితి. అంతట—

ఉ. అబ్బురముగ ముదంబుఁ బ్రణయానునయంబులఁ దోపుచూపులన్
నబ్బున నెల్ల మేనునఁ గనంబడు నిప్పులకాంతురాళిఁ బై
నుబ్బిన నా విమోహమును నూహమునం గనిపట్టి రొప్పుచున్
గొబ్బున వెల్వడెన్ సహజకోపన దేవి వివర్తితాస్యయై.

అట్టి రూపసంపద యెందును నుండదు.

తే. గీ. చంచలంబగు కనుఁగవ సౌష్ఠవంబు
విధుమధుర మగునమ్ముఖ విభ్రమంబు
లలితతమమగు నా తనూవిలసనంబు
నెందు నెవ్వారు గని విని యెఱుఁగ రెపుడు.

చ. చెలువగు కండచక్కెరఁవు చేనున మన్మథహాలికుండు న
ర్మిలిఁ గనకంపు నాఁగఁట బరిశ్రమ మొప్పఁగ దున్ని నాటఁ ద
ల్లలనయుఁ దేన వాల్వొరుఁగులందగఁ జల్లుచు బెంచి కావఁగా
విలసిలు రత్నపుం జెఱకు విల్గడఁగా మది నెంతుఁ గోమలిన్.

విదూ:- అట్లేని నీకల ఫలించుఁగాత.

రాజు:- నా కలయెట్లు ఫలింపఁ గలదు.

తే. గీ. ఆకసంబున గంధర్వలోక మట్టు
మెఱుపువలె స్వప్నమునఁ గాంత మెఱసిపోయె
కులము శీలము దేశంబు దెలియ దకట
యాతలోదరి పొందుపై నాశ యెట్లు !

పిమ్మట నుద్యానవనవృత్తాంతము నీకును దెలియుఁ గదా.

విదూ:- కొంత యెఱుఁగుదుఁ గాని యంతయూ నెఱుఁగను. బ్రహ్మ
లోకమునుండి వచ్చిన బంగరు రాయంచను నీవు పట్టుకొనఁ
గనే బ్రాహ్మణసహజమగు భయముచేఁ బరుగెత్తిపోయితిని.
తరువాతి వృత్తాంతము సెప్పుము.

రాజు:- నేను పట్టుకొనఁగనే వడకుచున్న రాజహంసను జూచి నా మనసు కరఁగుటచే నద్దాని విడిచిపెట్టితి.

చ. తపములవల్ల నైన నది దక్కదో నిక్కలఁగాంచి దేనికై తపన వహించుచుండితో విధాతృకృతిం బ్రతిలేనియట్టి యా చపలవిలోచనం ద్రుహిణసాక్షిగఁ గూర్చెద నిప్పుడిట్లు నా కుపకృతిసేయు నీకు నిఁకనూఱడు నానుడి నమ్ము భూవరా.

అని చెప్పి పోయెనుగాని మరలి రాదయ్యెను.

విదూ:- కార్య మంతయు నెఱవేఱినను నీ కిట్టి చింతయేల?

రాజు:- (నవ్వి) ఇప్పటి కింత నెఱవేఱినది. చూడుము.

తే. గీ. ఆ మగువ జూడ నెవ్వని యాత్మజ యొకొ
యేది దెలియదు దూతియు నితరజాతి
కాముమాయయొ యిదియును గలయొ భ్రమమొ.
విధి యిటు మదీయ చపలత వెలువరించె.

విదూ:- పురాణగాథలలో నిట్టి సంగతి గలదు. ఏమన కలలోఁ గనఁబడిన యనిరుద్ధునే యుషాకన్య పొందెను. నీకును నట్లే కాఁగలదు.

రాజు:- అది చిత్రరేఖ దగునేర్పున నొడఁగూడెను.

విదూ:- ఇది నా నేర్పునఁగాఁ గూడదా? ప్రజ్ఞావిశేష మాకారమును బోలియుండునని యెన్నఁదగదు. సకలలోక మాననీయమగు సుగంధద్రవ్యము పునుఁగుపిల్లి యండకోశమున నుండదా?

రాజు:- (నవ్వి) ఎటులయినఁ గానిమ్ము. కాలము వడిగాఁ గడచునట్లు ప్రేలుము.

విదూ:- నీవు కలలోఁ గనిన కన్నియను చిత్త్రమున వ్రాయుచుఁ గాలక్షేపము సేయుము.

రాజు:- అది యింకొక యనర్థమే యగు. అప్పుని మల్లుదీసి కొట్టు నాటిన తీఱెగదా! మఱియు నప్పునివలన నాయాశామేగాక ఫలమేమియుఁ గలుగదు. గానఁ బోనిమ్ము.

విదూ:- అది సఫలమేయగు.

రాజు:- ఎట్లు?

విదూ:- ఆ యాకారముఁ జూచి. సాముద్రిక లక్షణ విదుఁడగు నా మిత్రుఁడు సత్యాచార్యుఁ డామె యెవ్వనికన్యయో? ఏ దేశమున నుండునో, యెవ్వానికిఁ బత్నియగునో అంతయుఁ జెప్పఁ గలఁడు.

రాజు:- (తనలో) ప్రియమిత్రుఁ డక్కోమలి నవివాహితఁగానే తలంచు చున్నాఁడు. (స్మృతి నభినయించి) నిజముగా నవివాహితయే. ఏలన-

మ. కలలో నన్ను ననంగ రాగరస మొల్కం గాంచు కంజాక్షి దా
గళనాళంబు సనన్యభూజయదర్శికంబుగా విలోకించితిగా
విలసత్కాంచనరత్నహారలతికా విభ్రాజితంబయ్యు మం
గళసూత్రోనము గానఁ గన్నియయె నిక్కంబుంచు భావించెదన్.

(ప్రకాశముగా) నీవు బాగుగా నాలోచించితివి. చిత్రసంభారముం గొనిరమ్ము.

విదూ:- మంచిది యని పోవును.

కంచుకి:- (ప్రవేశించి తనలో) మహారాజు ఒంటరిగనే యున్నాఁడు.

ఉ. ఆకల్లాడిన మోము ద్రిప్పి యటువై పాలించు నిశ్చేష్టుఁడై
యేకాగ్రంబునఁ జూచు నొక్కవలనే యేపార నిందొక్కఁడే
యేకాంతంబున నుండి తాన తనలో నేమేమో యోచించు ను
త్సేకించెగా ధరణీశు నెమ్మనమునగా జింతార్ణవం బెంతయుగా.

మహారాజునకు విచారకారణ మేమైయుండును. (ఆలోచించి) ఈ సందియము నాకేల! సమయము గానిమ్ము. కాకుండ

నిమ్ము. తెలిసినవార్త విన్నవింప వలయునని మాకు రాజాజ్ఞ గలదు కదా. (సమీపించి) (బెత్తము నేలమీఁద గొట్టుచు) ఏలినవారి దర్శనమునకై పురజనులు వేచి యున్నారు.

రాజు:- ఇప్పుడు సమయము గాదని చెప్పి వారి ననుపుము. సత్యాచార్యుని నిలుపుము.

కంచుకి:- ఏలినవారి చిత్తము. (అని పోవును.)

రాజు:- (తనలో) నిజముగా నేనిప్పుడు వేఱు నలుఁడనే యైతిని. పూర్వపు నలుఁ డెందో డాఁగెను.

చ. అలజడు లెన్నివచ్చిన ననాకులతం దగు నెమ్మనంబునన్
గలఁత దిటంబుగాఁ గలిగెఁ గాయువుచోటగు మిత్రకోటిపై
బలియు విరాగ ముప్పతిలెఁ బైకొనియెన్ బెఱుయింతి వార్తయుం
దొలి నలునందు నిందొకఁడు నూల్కొనెనే గన నన్న దేనియున్.

(ముందుఁ జూచి) ఈ మూర్ఖుఁడు గలావతిచేతనే చిత్రపు సామానులు దెప్పించుచున్నాఁడు. ఇది దేవికి బహిఃప్రాణము. దొంగిలిన వస్తువు కావలివాని కప్పగింపఁ బడియె. (ఆలోచించి) ఇప్పు డేమి సేయవలయు. ఇటు లగుఁగాక.

(కలావతితోఁ గూడ విదూషకుఁడు వచ్చి)

విదు:- మీ కోరిన విధమున (అనుచునే రాజు చేసన్నగ్రహించి) మందబుద్ధినై యది తేమఱచితి.

కలావతి:- అయ్యది కొనిరానైతినను చారాయణుని మాటచేతనే దేవరవారికి విచిత్రవస్తు దర్శనవిషయమునఁ గలకుతూహలము విశదమయ్యెను. కానిండు. దేవికి విన్నవింతును. అనిపోవును.

విదూ:- దుష్టదాసి పోవుగాక. చిత్రపు సామానులు వచ్చినవి.

రాజు:- అవార్యమగు ననర్థము సంప్రాప్తమాయెను.

విదూ:- ఒక దండప్రణామముననో, ఒకమాఱు పాదతాడనగ్రహణ మాత్రముననో సాయంకాలమున సులువుగఁ దొలఁగిపోవు దేవికోపమునకడ చింతయేల?

రాజు:- సాయంకాలము వార్త యటుండనిమ్ము. ఇప్పుడు జీవించినఁ గదా రాత్రిముచ్చటమాట. రంగుల నిట్లిమ్ము.

విదూ:- ఇది వలక — యిదిగో దూది — యియ్యవి రంగులు.

రాజు:- వానిని గ్రహించి ధ్యానము సేయుచు

చ. లలన మనోహరాకృతిఁ దలంప వలంతి యెటాను నుల్ల మ
వ్వల నొడలెల్ల గ్రమ్మ స్వదుటఁ బాణియు నాడ దదట్టులుఁడ ని
వ్వలనుల నెల్లఁదోఁయ వరవర్ణినిరూపుల నెద్ది వ్రాయ నా
వలనుపడంగ నేర దిఁక వ్రాయుటయెట్లు గడంగి చూచినన్.

విదూ:- తోఁబుట్టు వగు ధైర్యముతోడ్పాటున వ్రాయుము.

రాజు:-

తే. గీ. నాదుమదిగోడ మదనుఁడేనాతి వ్రాసె
దెసల నేకాంత వ్రాసె నాదృష్టియట్టి
లలనవ్రాయుదు నీ చిత్రఫలకమందు
సిద్ధి యెంతయు మదనునిచేతఁగలదు.

ఎట్లోలిఖంచి, మిత్రుఁడా చూడుము,

విదూ:- ఆమెయే యీయమ

రాజు:- అగును.

విదూ:- భగవతీ! నీకు నమస్కారము ఏ నీవు మహారాజు సంతాప మునకుఁ గారణమయితివో (రాజునుజూచి) కనఁబడినట్లే వ్రాసితివిగదా!

రాజు:- అట్లె వ్రాసితి (చిత్రముచూచి కన్నులనీరు నించుచు)

శే. గీ. వడతి నిగాజాతు నీమేను వాడదుగద
తాఁకుదును మేనిమెరుగేమి తగ్గదుగద
మదినిఁదాల్చెద నాకట్టి మనసెయున్న
మొదటినేరము నోర్వుమో మోహసరసి.

విదూ:- సిద్ధి దగ్గఱనుండఁబల వరింప నేల,సత్యాచార్యునిఁబిలిపింపుము.

రాజు:- (మనసు నిలుపుకొని కన్నులు దుడిచికొని) ఎవడక్కడ ?

కంచుకి: నేఁనున్నాడ.

రాజు:- సత్యాచార్యుని బిలిచికొని రమ్ము

కంచుకి:- (సత్యాచార్యుని తోడుకొని వచ్చి) వీరే మహారాజుగారు. పొమ్ము.

సత్యాచార్యుడు:-దైవజ్ఞుల బ్రదుకు బలు నపవాదములతోను నల్ప లాభముతోనుగూడినది (సమీపించి) మహారాజుగారికి శుభ మగుఁగాక.

రాజు:- దైవజ్ఞవర్యా ! ఆసనమున గూర్చుండుము.

సత్యాచార్యు:- (కూర్చుండును.)

రాజు:- కంచుకీ! మా సెలవులేక యెవ్వని నేని నిటకు రానీకుము.

కంచుకి:- చిత్తము (అని పోవును)

సత్యాచా:- (వినయముతో) ఏలినవారియాజ్ఞ యేమి ?

విదూ:- నీవు దైవజ్ఞుఁడవుగావా ? చేతనద్దము బట్టుకొని నాముఖమున నేమియున్నదని యడుగనేల? మహారాజుగారి మనసులోని సంగతి చెప్పుము.

సత్యా:- విదూషకుని మాటలలోని యక్కరముల లెక్కఁబెట్టుచు బహుశా స్త్రీనిగూర్చియో శ్రీనిగూర్చియో చింతగలిగెను,

విదూ:- నీవు గణితమునసే గాక మంత్రాంగమునందును బండి తుఁడవు. ఏలన రాజులు దఱచుగాఁ సర్వకామపరాయణులని గ్రహించి దాని కనుగుణముగాఁ బలికితివి.

సత్యా:- (కోపముతో) చారాయణ! నీ పరిహాసము నిరంకుశమైనది. ఇప్పుడు చూతుము. (ఆలోచించి) స్త్రీనిగూర్చియే చింత గల్గెను.

రాజు:- మీ ప్రజ్ఞావిశేషము మాకుఁ దెలియదా! ఇప్పుడు క్రొత్తగాఁ బరీక్షింప నేల? (అని చిత్రపటమునుఁ జూపుచు) ఈ యింతి యేకులమున జనియించెనో యేకులము వానికిఁ బత్నియగునో సాముద్రికలక్షణములచే మీరు కనిపట్టుఁడు.

సత్యా:- (చూచి) మనుష్య కన్యకయే.

విదూ:- రాక్షసియో యని సందియము గలిగెడిని.

రాజు:- (తనలో) ఈ రూపము మానవస్త్రీలలో నెట్లు సంభవించును. (ప్రకాశముగా) తరువాత, తరువాత-

సత్యా:- (సంతసముతో)

తే. గీ. కనుల రెంటను దీర్ఘ యా కమలనయన
యున్నతయు నాసవక్షోజ యుగిని మాఁట
నమర కిన్నర నాగ కన్యకల కెందు
దొరకదీ రూపు త్రైలోక్య దుర్లభంబు.

విదూ:- ఇహిహీ ! చిక్కితివి. మా మాబిడె రూపు నిట్టిదే.

సత్యా:- (ఆశ్చర్యముతో) ఎట్లు?

విదూ:- ఆమెయు కాళులు రెంటను దీర్ఘయు కన్నులు, పన్నులు, కడుపునను మూఁడిట నున్నతయుఁ గదా!

రాజు:- (నవ్వి) ఈ యసంబద్ధ ప్రలాపముతో నేమి. చూడవలసినది చూడుము.

సత్యా:- నిక్కముగా భాగ్యరేఖయు గొదవలేదు. ఈ యమయందుఁ దంద్రిదగు ముఖచ్ఛాయయు గలదు. ఈమె జనకుఁడును మహారాజే అయియుండును.

రాజు:- (తనలో) ఈ సందర్భము మున్నే తలంచితిని. ఈ కన్నియ నొందెడు భాగ్యయుతుఁ డెట్టివాఁడో ? ఈ కన్నియ యే దేశమునఁ బుట్టియుండును?

సత్యా:- క్షణము సే పాలోచించి వకారము మొదటగల దేశమున. విదర్భ దేశముననో విరాటు దేశముననో.

రాజు:- ఈమెకు వివాహయోగము గలదా?

సత్యా:- బాగుగా నున్నది. మఱియు.

తే. గీ. మెఱపు నొఱపుల వెలిగెడి మేనివలన
వంకరై చీలమండల వఱలు జడను
వెడలుపై నిడుపై యుండు వీక్షణముల
నెల్లదీవుల యేలిక కిం తి యగును.

విదూ:- ఎల్లదీవుల యేలిక యనుటచే నీకే భార్య యగు నని తెలియుచున్నది.

రాజు:- (తనలో) ఈ మాట త్రిలోకాధిపతి యగు దేవేంద్రునందును వర్తించెడిని. (ఆలోచించి) కానిమ్ము. అడుగుదును. (ప్రకాశముగా) భగవానుఁడా! ఈ యన్ను నరవరునకు భార్య యగునో, సురవరునకు భార్యయగునో తెలిసికొన నలవి యగునా?

సత్యా:- ఇదిగోఁ జెప్పెదను. (ఆలోచించి) దేవపత్ని యగుటకును బ్రసక్తి యున్నట్లున్నది.

రాజు:- ఆ దైవనియోగ మెట్లున్నదో. ఆశాతంతువు డెగిపోయెను.

విదూ:- ధైర్యము విడువకుము.

రాజు:- (ప్రకాశముగా) బాగుగాఁ జూడుము.

సత్యా:- అట్లె చూచితి,

తే. గీ. సురవరుల్గూడ వరియింత్రు సుమశరీర
బలు తెఱంగులఁ గడఁగియుఁ బడయఁజాల

రాజు:- రింక నీ యనవద్యాంగి యెవనిఁ బొందు

సత్యా:- నల్లదీవుల యేలిక నే వరించు.

మఱి యేమన నీయమ వివాహమునకు ముందును వెనుకను
గూడఁ బెక్కు నడ్డంకులు సంభవించును.

రాజు:- (తనలో) అడ్డంకు లనుట యనుగ్రహాక్షరములే. దీనింబట్టి
పదంపడి లాభమే కలుగునని తోఁచెడిని.

సత్యా:- కాలక్షేపకరములగు పలుమాటలతో నేమి హంసమువచ్చి
యిప్పుడే యీ మెవార్త తెలుపఁ గలదు.

విదూ:- రాజును చూచి ఈ మహాత్ముఁడు దేవుఁడే యగు.

రాజు:- (తనలో) హృదయమా, కోరిక ఫలింపవగుఁ గానఁ గొంచె
మూఱడిల్లుము. (సత్యాచార్యులనుజూచి) యీ వార్త మీరు
మనసున నే యుంచికొనుఁడు.

సత్యా:- (నవ్వి) చిన్ననాటినుండియు మహారాజును సేవించు నే
నిద్దియు నెఱుంగనా!

తే. గీ. మంత్రతతి రాజవార్తయు మఱియు ధర్మ
మిలను దాఁచినకొలఁది క్షేమ లెసఁగునంద్రు
వెలువరించినయంతన బెడియునందు
రిది జగంబున నెంతయు విదితమె గద.

రాజు:- అలవుచెందితి.

సత్యా:- శుభము. విశ్రమించుడు. (అనిపోవును)

విదూ:- సత్యాచార్యుని మాట తప్పదుగదా,

రాజు:- చేరువనున్న కార్యమునుబట్టి నిశ్చయింతము. (నిట్టూర్పు
విడిచి) మనసు కలఁతనొందెను. దీని నుబుసుప్రుచ్చు నుపాయ
మేమి?

విదూ:- ఇతర రసముల ప్రవేశపెట్టి ప్రస్తుత విషయము మఱపింప వలయు.

రాజు:- (నవ్వి) శృంగారమే కడమరసంబుల నడంచును. ఇఁక నిది యెద్దానిచే నడఁగును. కానిమ్ము. చూతము. ఉద్యానమార్గము చూపుము.

విదూ:- ఇదిగో ఇదిగో. (అని జూపును) (అటులిద్దరు పోదురు)

విదూ:- (ఉద్యాన ప్రవేశము నటించుచు) పూఁదీవలల్లుకొని యొప్పు కొబ్బరిచెట్ల నీడ జల్లనై నలుదెసల నఱుట్లతోఁగూడి యల రారు నుద్యానమండపమునకు నరుదెంతువుగాక.

రాజు:-(ప్రవేశించి నలువైపులఁజూచి)ఈ తోటసొగసు మాటలకలవి గాదు. చూడుము. శకుంతంబులు మందమారుతంబునఁ గదలు మొగలిపూఁగుత్తులవలన దొఱఁగు మరందంబున నందమైన చల్లని నీరంబుల నలరారు గొలనులలో మోరలెత్తికొని యుయ్యాల లూఁగుచున్నవి. ఈ మండపముననే క్షణముసేపు గూర్చుందుదము.

విదూ:- మిత్రుని యిష్టము.

రాజు:- (ఇంకొకవైపుచూచి) చెలికాఁడా! ఇటు చూడుము. నలు దెసలఁ బోక మ్రాకుల నల్లికొనిన యెలతీవల మేల్కట్టులతో నొప్పి యప్పుడవిచ్చు పూఁగుత్తుల నెత్తావి నలరు పొదరిండ్లఁ జూడుము. [తెరలోఁ గలకలము.]

విదూ:- ఇది యేమైయుండును.

రాజు:- చూడఁగా నిప్పుడు మధ్యాహ్నమాయెనని స్నానగృహామునఁ బరిమళ ద్రవ్యముల నొడఁగూర్చు సేవకుల కోలాహలము గావలయు. ఇప్పుడు నభోమణి ఎచ్చోటు నలంకరించు చున్నాఁడో చూతుము.

విదూ:-(లేచికొంచె మావలకుఁబోయి పైనఁజూచి గడగడవడఁకుచు) అబ్బో! ఎవ్వఁడో రాక్షసునివలె బంగరుకాంతుల నన్నుఁ గప్పుచున్నాఁడు. నన్ను గావుము.

రాజు:- మిత్రుఁడా! భయపడకుము. ఎవఁడక్కడ ! విల్లు విల్లు. (అని యాథార్థ్యముతో నడచి పైనఁజూచి సంతసముతో) చారాయణా! అదృష్టము పండెను.

చ. అరుదుగ వ్రేళ్లువంచి ముదమారఁ బదంబుల బైటలాగుచున్
గిరగిర దిర్వుచున్ రుచులఁ గ్రేవలఁజల్లుచు దేవదాసిదా
కరమునుండి జారుకచి కాంచనపుం గొడుగోయనంగ బం
గరు కలహంస వచ్చె సుముఖంబగు నా సదదృష్టమో యనన్.

విదూ:- అటులేని నీ మండపముననే కూర్చుందుము.

రాజు:- నీకుఁ దోచినట్లే గానిమ్ము. (అని కూర్చుందురు)

హంస:- (ప్రవేశించి) మహారాజునకు జయ మగుగాక.

రాజు:- పులుగుఱేఁడా ! సుఖమా ?

హంస:- మహారాజువారి యనుగ్రహమున సుఖమే.

రాజు:- మీచే నే దేశము విడిచివచ్చుటచే విచ్ఛాయము గావింపఁబడియె.

హంస:- విదర్భదేశమున దమయంతీదేవిసన్నిధినుండి భగవతి భారతీదేవిచే ననుపఁబడి యిటకు వచ్చితి.

రాజు:- (సంతసముతో) ఎట్లు. ఆ కన్నియ ప్రియమిత్రుఁడగు భీముని కొమరితయే కాఁబోలు.

హంస:- అగును.

రాజు:- ఆహా ! విదర్భదేశమున నన్నియు మహారాజపుత్రి యనియు అతిరూపవతియనియు దైవజ్ఞునిచేఁ బలుమరు దెలుపఁబడితిని, దెలిసిన దమయంతినే గ్రహింపఁజాలనైతి.

విదూ:- ఆ నేఁడు నీ చిత్తక్షోభము దే.

రాజు:- నిజము

విదూ:- ఏదో యోజించుచున్నాఁడవు. సత్యాచార్యునిమాట పరిశీలించితివా ?

రాజు:- అట్లనకుము. దైవజ్ఞులమాటలును, చెప్పెడివారి ప్రమాదమున నో, విను వారి దురదృష్టముననో ఫలింపక పోవచ్చును.

విదూ:- సత్యాచార్యునిమాటలు రామబాణములే.

రాజు:- ( తనలో ) ఇప్పుడీ సంగతి నడుగుదునా ? (ప్రకాశముగా) సరస్వతీదేవి యచ్చట వసింపఁ గారణమేమి?

హంస:- ఈ లేఖవలననే గ్రహింపఁ గలవు. (అని లేఖ నొసంగును.)

విదూ:- (లేఖదీసికొని విచ్చి)అయ్యో ! ఇవిమను యక్షరములేగావు.

రాజు:- (ఆశ్చర్యముతోఁ జూచి) సరస్వతీదేవి తనకరారవిందముతోన వ్రాసెనా ? యేమి ?

హంస:- అగును.

చ॥ సరమున నొప్పు ము త్తెములచాడ్పునఁగూడియుఁదేట వెల్లుచున్
వరుసలు దప్పఁగాక మఱివంకర లేమియుగాక సన్నలై
బరువడి వత్తు లొండొకటిఁబాసియు నొప్పెడి నిందుఁజూడఁగా
నరరె యమానుషంబులు సఖా! యిటగంటిమె యెందు నెన్నడున్.

(సరస్వతీదేవి నుద్దేశించి, కన్నీరు నించుచు దగ్గుత్తిక వడిన యెలుంగుతో)

మ॥ పరతత్వంబవు నీవ నాదమయశబ్దబ్రహ్మ వీవే సుఖో
త్కరమా బిందుకలాత్మవీవ యిఁక నీకాయుంబు వర్ణాకృతిం
బరిణామంబు వహింపదేని నపుడే భగ్నంబులై లోకముల్
నరయన్ మున్గవె యంధకార మను మున్నీటన్ మహాభారతీ.

(అని యా లేఖ గన్నులకు నద్దుకొని చదువుచున్నాఁడు.)

చ॥ జగముల నెల్లెడం గలుగు చక్కదనంబుల ప్రోవు నిగ్గునన్
మగువను జేసి ధాత తనమానిత సర్గము సప్రయోజనం
బగుటకు నిన్నుఁ గూర్పు మని యాన యొసంగుచుఁ బంచెనన్నొ నో
యగణితరూపశీల, తగునట్లులు సేయుటయొప్పు నీ కికన్.

శుభకార్యంబులకుఁ బలునాటంకంబు లుండుననియు, శుభస్య శీఘ్రమ్మనియు నీవు పెద్దలవలన వినియె యుందువు. కాన దానికిఁ దగునట్లులు సేయునది. తక్క వివరములు హంస వలననే గ్రహించునది అని.

రాజు:- (తనలో) భగవతి సరస్వతీదేవికి నాయెడ నిర్హేతుక మగు ప్రేమ యెంతయో దీనికి దగునట్లు నేనేమి సేయవలయు.

హంస:- (చెవిలో) ఇట్లు ఇట్లు.

రాజు:- అనుగ్రహింపఁ బడితిని.

హంస:- మధ్యాహ్న మయ్యెను తమ్మిచూని మణికర్ణికాస్నానము నకుఁబోవు సమయముగాన నేను నిక్కపు జగమునకుఁ బోవలయు.

రాజు:- మహోపకారీ ! అట్లే చేయుము. తిరుగ మనకు త్వరగా సమావేశము సంభవించుఁగాక.

హంస:- నన్ను మఱువకుము.

వైతాళికులు:- మధ్యాహ్నము. మహారాజుగారికి సుఖము నొసగు గాక !

స్వప్న మను ప్రథమాంకము.

శ్రీ శివాభ్యాం నమః

# నలవిలాసము

## ద్వితీయాంకము

( కూర్చుండి విచారపడుచు బృహస్పతి ప్రవేశించును. )

బృహ:- తూర్పుదెస కెదురుగా దోయిలి పట్టుకొని,

తే॥ గీ॥ ప్రణుతు లొనరింతు మంగళప్రదము లైన
పార్వతీపరమేశ్వర పాదములకు
గోవులకు సాధులకు మేలు గూడుగాక
పవ లగుంగాత సమ్మోదావహము మనకు.

(అనుచుఁ గన్నులుఁ దెఱచి) ఎట్లు తూర్పు దెల్లవారెను.

ఉ॥ వెన్నెలపుల్గు లాసపడి వెన్నెలవెల్గుల నిల్వఁ జేసెడిన్
బన్నుగ నొండొకళ్లవయిఁబంచెడిఁజూపులఁ జక్రవాకముల్
క్రన్నన మేలుకాంచి పటుకాండ మొనర్చెడి సామగీతులన్
జెన్ను వహించె దేవమునిసీమలు నిర్జరలావితంబు లై.

( తెరలో )

అఖిల సురాసురవందిత చరణారవిందుఁడగు మహేంద్రునకు
సుప్రభాతము.

బృహ:- (నవ్వి) మహేంద్రుని గుణములు రాజమూర్ధన్యునకుఁ దగ
నట్లే యున్నవి.

తే॥ గీ॥ భీమసుతకేమి తనయందుఁ బ్రేమశూన్య
మూనెను వివాహ మాడ శక్యంబు గాదు
వేల్పు లెల్లరచే నార వేడఁబడెడు
భైమి కడకంటి చూపైనఁ బడయరాదు.

అబ్బా ! ఇతఁడు గౌతమ మునిపత్నిమూలమున భంగపడియు
మంచి చెడుగుల గ్రహింపఁజాలఁడు. ఇందు వీనితో నేమి ?
మన్మథబాణపంచక మోర్వరానిది.

తే॥ గీ॥ మూఁడుతూపుల జగములు మూఁడు గెల్చి
తక్కు రెంటిని రతి కవతంసముగను
జేసి విహరించు చున్న విచిత్రవీర్య
వశము గాకున్న జనము లెవ్వారు గలరు.

మరియు నివ్వి డింకొక కీడు మూడినది.

తే॥ గీ॥ సహజకాముకుఁడై యుండ శక్రుఁడిటకు
నిపుడ కలహాశన మునీంద్రుఁ డేగుదెంచె
గన్నదొలుత నె మితిమీఱి కలఁగియుండ
నందు దిటమగు నలకయు సందుకొనియె.

జగడము దొరకమి వెతపడు నీ ముని నాతకుని చూపు దూల
గొన్నదివోలె గురగురలాడుచుండు.

తే॥ గీ॥ కోరి యొండొరుమేలును గుట్టుకొనిన
ప్రథమ మిథునంబునే నెడఁబాప గలఁడు
కలహపరుఁడైన యిమ్మునిఁ దలఁచ నేని
నలబలారులఁ బగఁగొల్పు టనఁగ నెంత,

మెత్తనివారల నొత్తెదుకాలము దగుకౌటిల్య మవిచాల్యము.
నారదుఁడు పూర్వరాత్రంబున మహేంద్రునితో నేకాంత
మున త్రైలోక్యరత్నమయిన దమయంతి నీక తగుననియు,
ఒడఁబడుదేని సులువుగా నీ కందుననియు నుపదేశించి
యున్నాఁడు. ఇఁక యెట్లు పొసఁగఁ జేయవలయు ? పొసఁగఁ
జేసియుఁ బావుకొనున దేమన.

తే॥ గీ॥ పరఁగ రాజ్యగ్రహంబుచేఁ బట్టువడిన
పుడమిఱేండ్ల మనోవృత్తి పోలుచు నిట్లు

పోసఁగు టెంతయుఁ దనదైనబుద్ధి యనియుఁ
బొసగకుండుట మంత్రిజుబుద్ధి యనియు.

అయినను చింతింపఁబనిలేదు. ఇది యంతయు జీవలోకంబు స్వభావము. మంత్రిజనులు దేవళమీఁది బొమ్మలవోలె బరువెల్ల మోయుట నభినయించుచు నాయాసపడుచుందురు. (ఎదురఁజూచి) విదర్భదేశవృత్తాంతము విచారింప ననిచిన విశ్వావసుఁడు వాడినమోముతో నిటకే వచ్చుచున్నాఁడు.

విశ్వా:- (ప్రవేశించి-సమీపించి) భగవంతుఁడా! వందనము సేయుచున్నాఁడను.

బృహ:- ఇష్టసిద్ధి నొందుము. విదర్భదేశములోని వృత్తాంత మేమి?

విశ్వా:- భగవానుఁడు మును గనిపట్టి వాక్రుచ్చినదే.

బృహ:- వానిచేయి దనచేతితో నప్పళించుచు పూజ్యురాలగు శారదాదేవి యచ్చట నున్నదా!

విశ్వా:- అట నుండుటయే కాదు. ఆమె సత్యలోకముమాటయే మఱచి పోయినది.

బృహ: దేవియే నలునకుఁ గబురంపెను.

విశ్వా:- ఈ వార్త వెల్లడి గాలేదు.

బృహ:- నిజమే.

విశ్వా:- అది యేమది!

బృహ:- కుండినపుర బాహ్యోద్యానమునందుఁ గులదేవతా సమారాధన మను నెపమున దమయంతిం దోడ్కొనివచ్చి నీకుఁ గలుపుదు నని శారద నలునకు లేఖ యంపెను.

విశ్వా:- ఇది మీ కెట్లు దెలిసెను?

బృహ:- పితామహునివాహనమగు బంగరురాయంచ నిన్న నీదారినే సత్యలోకమునకుఁ బోవుచు మన నగరవృత్తాంత మెఱుఁగదు గాన నీ సందర్భము మాకుఁ జెప్పెను.

విశ్వా:- అట్లేని నిజమే.

బృహా:- అచ్చటి విశేషవార్త యేమి ?

విశ్వా:- క్రొత్త యేమియు లేదు.

మ॥ నలునే కోరెడి భీమనందన శచీనాథుండు వైదర్భిపై
వలపుంజెందె నటందు రీ నగరిలో వారిద్వరుం దుర్జయుల్
గలియుంగా విపరీత మేమి గలుగంగా నున్నదో నాను తుల్
వెలసెంగాదె విదర్భదేశములలో వింటే తురాషాట్గురూ.

బృహా:- ఏమి కాగలదు ? అంతయు నిశ్చయింపఁ బడియెను.

విశ్వా:- భగవంతుని యనుగ్రహామువలన మేలు కలుగు ననుట
నిజమే. మంత్రిబలమే రాజుల కెల్ల కోరికల నిడు చింతామణి
గదా !

ఆ॥ వె॥ ఊఁత యేమిలేనియూర్ధ్వలోకంబులు
గాలియంద నిలిచి క్రాలునట్లు
పట్టులేని భూమిపతుల సంపదలును
మంత్రబలమునంద మలఁగుచుండు.

కావున దేవరవారు మంచియుపాయము నాలోచింతురుగాక.

బృహా:- (ఆలోచించి, మోవి విరచి) ఇప్పనికి సరి యగునుపాయమే
లేదు.

విశ్వా:- భీమరాజు కొమరితకు స్వయంవరము గావించు ననువార్త
విదర్భలోఁ బ్రబలియున్నది.

బృహా:- ( నవ్వి విశ్వావసుని తలతడవి ) సుబుద్ధీ ! మన మిప్పుడు
దానికే భంగము గావింపవలయు. ఏలన మొదల దమయంతి
నలునిఁ గోరుచున్నది. పల్లము నెనుకునీటికి గాలువఁ జూపి
నట్టు లద్దానికిది దోడ్పడఁ గలదు.

విశ్వా:- అట్లేని దూత్యమునైన నాలోచింపవలయు.

బృహా:- ఎవనిచే నెవ్వనికి ?

విశ్వా:- దమయంతిచిత్తము నచ్చరలచే మన స్వామియెడ నను రంజింపఁ జేయుటయు.

బృహ:- అది సరి యగుమార్గము గాదు.

విశ్వా:- ఏల ?

బృహ:- మొదట మనము గోరుగన్నియ నతఁడట్టు లితరులద్వారమున వేఁడుచున్నాఁడని మహేంద్రునెడ నైషధునకు విరోధభావము గలుగును.

విశ్వా:- అయిన నేమి ?

బృహ:- హా వత్స ! అట్లనకుము. ఎల్లదీవులఁ గెల్చి, దేవాసురమహాసంగ్రామములలో మనకు బలుమాఱుసాహాయ్యకము గావించిన, నలుని, పరాక్రమాతిశయము నీవు మఱచితివా ?

ఉ॥ దీవుల నన్నిటం గడుప్రతీతి వహించినరాజ్యలక్ష్మితో
భావజుఁ జీరికింగొనక భాసిలు నద్భుతరూపరేఖతో
జీవనుతప్రభావమున దీపితుఁడౌ నలు నుజ్జగించి యిం
కేపథమౌ గుణంబుఁగొని యింద్రుని భైమి వరించుఁ జెప్పుమా.

కాని యిఁకొక్క యుపాయము గలదు.

విశ్వా:- ఏది

బృహ:- ఇప్పటికిని దూత్యమునకై నైషధునే ప్రార్థింప వలయు. అట్లని నాయనకుఁగోపంబు వొడమదు. మఱియు మహేంద్రునకై నలుఁడే దూతగాఁబోవునేని నీమూర్ఖుఁడు దన్నుగోరునన్ను నొరునకు నీయఁగడఁగుచున్నాఁడనియాభైమికి నతనిపై విరక్తిగలుగుటను ఇతఁడే దూతగాఁగల మహేంద్రు డెంత యధికుఁడోయని తోఁచుటను పాకశాసనునందు ననురాగముదయింపఁగలదు.

విశ్వా:- నలుండే దూతయగునేని భైమి తప్పక మహేంద్రుని వరించును. కాని యేమందమతి యయినఁ జేతిలోని రత్నమును బారవైచునా ! నలుఁడు దూత యగు టెట్లు?

బృహ:- ఇదియంతయలభ్యముకాదు. నైషధునివ్రతము నెఱుంగవా!

విశ్వా:- ఆయనవ్రత మెట్టిదీ ?

బృహ:-

తే. గీ. విడుతు రాజ్యంబునేని జీవితము నేని
గాని నిజముగ నప్రాప్తకాము లయిన
యాచకులఁ జూడజాల నే ననువ్రతంబు
నిత్యమైయుండు నందురు నిషధపతికి.

విశ్వా:- ప్రహర్షముతో అట్లేని దమయంతికి నలప్రాప్తి భంగపడి యెను ఇఁక మీసంకల్ప మెట్లు నెఱవేఱకుండును ?

బృహ:- అట్లు నమ్మఁదగదు.

విశ్వా:- ఏల ?

బృహ:- రాజర్షియగు నలునిదాతృత్వంబును, మహానుభావత్వంబును, సకలలోక ప్రసిద్ధములు. దానంజేసి గుణగ్రాహిణి, సూక్ష్మ బుద్ధియు, నగుదమయంతి ఇదియంతయు నుత్తమగుణముగానె గ్రహించి నైషధునే వరించును. ఆమె యెట్లున్ననూ శారదా దేవి నలునినే వరింపఁజేయును.

విశ్వా:- (దుఃఖముతో) అటులేని నీయత్నము నెట్లు భంగముసేయ వలయు ?

బృహ:- ఎట్లును శక్యముగాదు అయిన నింతకన్నఁ జేయునది లేదు. కావున నీ వేగి మహేంద్రుని త్వరగా బ్రయాణముసేయింపుము.

విశ్వా:- పోయి మేమేమి సేయుదుము ?

బృహ:- వత్సా! అట్లనకుము. ఈశ్వరసంకల్ప మెవ్వని కెఱుక ? శాస్త్రదుష్టమగు మార్గమున నాలోచించుటయే మంత్రుల పని. సిద్ధియున్న నో దైవవశమున నుండును.

తే. గీ. అగునటులు దోఁచి కానేర వరయగొన్ని
కానియట్టులదోఁచి యగుచుండుగాదె కొన్ని

కార్యములు మంత్రములు సాధనములుగా
విధి కటాక్షాను గుణము లై వెలయుఁగాన.

కావునఁ బోమ్ము. చెప్పినపనితీర్పుము. ఏను గంగానదీతీరము నకు సంధ్యావందనమునకై పోవుదును (అనిపోవును)

(ఇది విష్కంభము)

---

అనంతరము రథమున మాతలితో మహేంద్రుఁడును
విమానమున విశ్వావసుండును బ్రవేశింతురు.

ఇంద్రుఁడు:- మాతలీ! విదర్భ దేశమునకు త్వరితముగాఁ బోవునట్లు పగ్గముల సడలింపుము.

మాతలి:- అయుష్మంతుఁడా ? ఏమని సెలవిచ్చితిరి ? మీ యాజ్ఞాక్షరములు వినఁబడుట లేదు.

ఉ. ఆడెడు నప్సరోంగనల యందియలన్ వెలువడ్డ నాదునన్
పాడెడు కిన్నరావళుల భవ్యమృదంగ భవార వోన్నతిన్
వేడెడు చారణస్తుతుల పెల్లునఁగల్గెడు శబ్దసంతతిన్
మాఁటుజగంబు లొప్పెడిని మూర్తి వహించిన నాదమోయనన్

ఇంద్రుడు:- (బిగ్గరఁగా) విదర్భ దేశములకై రథము త్వరితముగా నడుపుమని చెప్పుచున్నాఁడను.

మాతలి:- అట్లు చేయుచున్నాఁడను ఇప్పుడుగదా.

చ. కరి రథ వీరవార తురగంబుల సందున నొత్తుకొంచు ను
త్కట భట హేమదండముల తాఁకులకుం దలలం గదల్పుచుం
శిరముల నంజలుల్ సెలగఁ జెన్నుఁ దలిర్చెడి నిన్ను జూచుచున్
సురలు జరించుచుండి రిటు జూడుము సందడి నొప్పు నిప్పుడిన్

అమరావతీ ప్రాంతము దాటిపోయినది.

ఇంద్రుఁడు:- ఇప్పుడెచ్చటికి చేరితిమి ?

మాతలి:- మందాకిని దాటుచున్నారము.

ఇంద్రుఁడు:- ఇంకను మందాకిని వద్దనేయుంటిమా ?

మాతలి:- (ఉత్సాహముతో) ఆయుష్మంతుఁడిక మాతలిదగు హస్త కౌశలము గ్రహింప వలయునని పగ్గములఁ గదలించును.

ఇంద్రుఁడు:- ఇప్పుడు మన మెచ్చటికి వచ్చితిమి ?

మాతలి:- భూమికి నర్ధయోజనముమాత్రము దూరమున నున్నాము.

ఇంద్రుఁడు:- పగ్గముల బిగబట్టుము. ఎన్నఁడునూ జూడనికొత్త భూప్రదేశముల మెల్లఁగాఁ జూడవలయు.

మాతలి:- చిత్తము (అని అట్లచేయును)

ఇంద్రుఁడు:- మరియుఁ దెల్లగా వెలుఁగు నకొండ పేరేమి ?

విశ్వా:-ఈయదిపరమేశుఁడగు గృత్తివాసునకు నివాసమగుకైలాసము

చ. జగములలోన విస్మయరసస్థిరసాగర మీ నగేంద్ర మం
దగణిత సోమ సూర్య దృషదా కలితామల కుట్టిమంబులన్
దగ విహరించు కామహాను దక్షిణవామ సమీక్షణంబులన్
బగబగమందు నొక్కయెడఁబర్వ జలం బతివేల మొక్కెడన్

ఇంద్రుఁడు:- (ఇంకొకవైపుచూచి) విశ్వావసూ! అక్కడనేమివింత? మహర్షులు గుంపులుగూడి దోసిలియొగ్గి కనుదమ్ముల నీరు గార్చుచు డగ్గుత్తికవడిన యెలుఁగుతో స్తోత్రము చేయుచున్నారు.

విశ్వా:- ఇవి సకల సురాఽసుర శేఖరముల యందు విశ్రమించిన ధూళిగలపరతత్త్వము పాదపజ్జులు.వీనిని మీ వేయి కనుదమ్ములతో నర్చింపుఁడు.

ఇంద్రుఁడు:- (ఆశ్చర్యముగాజూచి భక్తివినయములతో) దోసిలియొగ్గి

ఉ. ఆదిమ పూరుషుండు గిటియై మును వేనినిఁగానఁ జాలఁడో
వేదములుం గడంగియును వేనిని గానవొ యభ్రకేశు న

ప్పాదము లీమహా కధర పాదమునం గని వీనియర్చనల్
నాదు సహస్రపద్మ నయనంబులఁజేసితి నైతి ధన్యుఁడన్

విశ్వా:- (ఇంకొకవైపు చూపి) మహాప్రభూ విూ వేయికన్నుల నిచ్చట సఫలము గావింపుము ఇది గంగానదితో నొప్పు వారణాసి,

చ. ఎట వినునొక్క యక్కరమె హేతువగున్ శ్రుతిజాల మల్లఁగా
నెట నిఁక నాటునొక్కఁతను వెన్మిదిగా నుదయించు నింక నె
చ్చటఁదల గంగబొట్టొకటిఁ జల్లిన గంగనె తాల్పనొనో యీ
కటకము చిత్రమై భవము గావ్యకృదుక్తుల కంద నేర్చునే

ఇంద్రుఁడు:- ఆనందవనము మహిమ మనోవాక్కులకు నందునదిగాదు (అని భక్తితోఁ బ్రణమిల్లి)

ఉ. మా నగరంబులోపల నమర్త్యసమూహము లబ్ధగంగలో
స్నానము సేసినన్ దినదినంబు నొడల్పరిశుద్ధి నొందుటే
గాని యిఁకేమిలే దిచట గంగమునింగిన జీవకోటికిన్
మానక ముక్తిగల్గుట సమస్తము గాశిక నీ ప్రభావమే.

మాతలి:- ఈనగరి యిట్టిదే (వేఱొకవైపుచూపుచు) గంగాయమునా సరస్వతులు నదులుమూఁడునుఁ గూడిన ప్రయాగ యెదురఁ గాన వచ్చుచున్నది.

ఇంద్రుఁడు:- ఈ త్రివేణి జీవకోటి యభీష్ట వరంపర నధిష్ఠింప నిచ్చునయగు (తనలో)

ఉ. ఇందుఁడు పంకజంబు లిట నేల మునుంగవు! మున్గినంత నే
పొందెడి భైమిదౌముఖముపోలిక నెంతయు నిక్కవంబుగా

బురద యింట నంతట నుండ మీఁగాలు మడిచికొను
చున్నాఁడ ఏలన

ఇందున నేనుగ్రుంక నిదియేల మునింగియె యుండి యున్నచో
నందమునొంది భీమతనయార్య నలాకృతి నొంది యుందుఁగా.

విశ్వా:- (పార్శ్వముతో) విదర్భ దేశ ప్రాంతమునకు వచ్చితిమి చూడుము ఇందు

ఉ. వీర రస ప్రవాహములు విస్మయవార్ధులు రమ్యవస్తువి
స్తారతిరార్థ సార్థమహితంబులు చిత్రయుతంబులన్ మహో
దారగభీరభావ కలితంబులు నైనకవీంద్ర ధోరణుల్
చారుతరంబు లై యమృతసారము తీరుఁదిరస్కరించెడిన్

ఇంద్రుఁడు:- మాతలీ ! విదర్భ దేశములలోనను స్వర్గము గలదా !

మాతలి:- కాదు. ఇది విదర్భ దేశములకు రాజధానియగు కుండిన నగరము

చ. భృశకమలా విలాసమగు భీమమహీవరు రాజధాని భ
వ్య శతసహస్రభూమికల భాసిలుసౌధము లెక్కఁచున్ జనుల్
పశుపతి శైలవారి నిధులంగని యందులఁ బేరు గన్నయా
దశముఖు దద్విరోధియగు దాశరథిన్ మదిమెచ్చ రేమియున్

ఇంద్రుఁడు:- అట్లేని నిచ్చట బాహ్యోద్యానముననే యుండుదము

మాతలి:- చిత్తము (అని నేలమీఁదికి దిగుచున్నాఁడు.)

ఇంద్రుఁడు:- దమయంతి యుండు నగర మిదియేఅని నిట్టూర్పు విడిచి విశ్వావసూ ! ఇఁకమనమేమి చేయవలయు నని యాచార్యుల వారు నుడివిరి?

విశ్వా:- విస్తరించి చెప్పనేల ! అదియంతయు మొన్న విన్నవించియే యుంటిని.

ఇంద్రుఁడు:- నిజమే. అయిన నుత్కంఠయే మఱల మఱల నడిగించు చున్నది.

విశ్వా:- మఱలఁజెప్పనేల ! నలునిమీఁద మక్కువగల దమయంతి నలుని ద్వారముననే దొరకవలయు నని చెప్పిరి.

ఇంద్రుఁడు:-

తే. గీ. మూఁడులోకములకు వేల్పుమూకలకును
ఱేడనగు నే నయ్యింతి వేఁడుచుండ
మనుజమాత్రుని భూలోక మాత్రనాథు
నెట్లు వేడెడి జూడుమా యెఱుక లేక.

అంతులేని కార్యచింతచే విసికిన డెంతము గలయూచార్యుండు పరిహారోపాయము నే యీ విధమున నానతిచ్చి యుండె నేమో! ఇందునిజమెట్లు తెలిసికొనవలయు? (ఆలోచించి) ఇక్కడివార్త నిక్కడివారివల్లనే తెలిసికొనవలయు! (నని యెదురఁ జూచి) ఎట్లుమన యెదురనే అమూల్యాభరణములు గలయొక కన్యక మదన శరపీడిత యగు నెవ్వరితనో కావఁ బూనినదివోలె జిగురులు గోయుచున్నది. చూడఁగానిది వైదర్భిసఖి గానోపు ననితోఁచెడిని. దీని నేనొక నెపమున నడుగవలయు (ప్రకాశముగా) మాతలీ? రథాశ్వము లలసి నవి. సేదదీర్పుము.

మాతలి:- చిత్తము (అని పోవుచు.)

ఇంద్రుఁడు:- విశ్వావసూ! మన మిచ్చటనుండి దమయంతి వృత్తాంతము తెలిసికొన వలయుఁ గావున నీవు సమీపించి యీ యన్నుతో నుక్తి ప్రత్యుక్తుల నారంభింపుము. మేము తిరస్కరిణి మాటున నుండి వినుచుందుము.

విశ్వా:- చిత్తము. అని పోయి (తనలో) దీని నెట్లు పలుకరింతును. (ఆలోచించి) కానిమ్ము. ఇట్లు చేయుదును. (ప్రకాశముగా) కల్యాణీ! నీ విచట నొంటరిగా నుంటి వేమి?

చేటి:- (వడఁకుచు) ఎవఁడో యిపి చూచుచున్నాఁ డని చిగురు టాకులఁ గప్పుచున్నది.

విశ్వా:- (తనలో)ఇది మిగుల భయపడు చున్నది, దీనిని పరిచయము సేసికొనుట యెట్లు? (ఆలోచించి) ఇది యొక మార్గము.

(ప్రకాశముగా) సఖీ! నన్ను పరునిగా భావింపకుము. ఒక మూకలోని జనునిఁ జూచి భయపడ నేల?

చేటి:- (తనలో) ఎవ్వఁడో వీఁడు గ్రొత్తవాఁడయ్యుఁ బరిచితుని వోలె నిర్భయముగాఁ బలుకరించు చున్నాఁడు. ఆలోచింపఁగా వాఁడె కావలయు. నిషధమహారాజు బయలుదేరుచుఁ దన రాక నివేదింప సరస్వతీదేవి సన్నిధికిఁ బ్రాణతుల్యుఁ డగు భద్రముఖుని నసిపె నని వినియుంటిని. కాని వీనియెడ శంకింపఁ బనిలేదు. (ప్రకాశముగా) నీవు నిషధనాథునిచే ననుపఁ బడితివా?

విశ్వా:- (తనలో) సంతసముతో. ఇఁక నేమి యడుగవలయునో తోఁపకున్న నాకు దారి నిదియే చూపెను (ప్రకాశముగా) అగును.

చేటి- నీవు భద్రముఖుఁడవే.

విశ్వా:- నాకుఁ బేరుగూడ నిదియే యుపదేశించెను.( ప్రకాశముగా) అగుదును.

ఇంద్రుఁడు:- (తనలో) ఇది యొక్కటి తెలిసెను. నలుఁడు భైమిని గోరుచున్నాఁ డనునది. కాని యిఁక భైమికి నలునియెడ ననురాగము గలదో లేదో తెలిసికొన వలయును.

చేటి:-ఓయి భద్రముఖుఁడా! నలునిరాక జెలువు నిన్నుఁ జూడఁగనే బ్రతికితిని. ఇప్పటికైనను ప్రియుఁడు వచ్చునని నమ్మి మా భర్తృదారిక ప్రాణము నిలుపుకొనును.

విశ్వా:- (తనలో) నలమహారాజు బైలుదేరి యుండునా?

ఇంద్రుఁడు:- (దుఃఖముతో) విశ్వావసూ! ఇప్పుడు వినవలసినది వింటిమి. ఇంకను మనకు దురాశ దేనికి? దమయంతి నలుని పై నెక్కువ యనురాగముతో నున్నది.

విశ్వా:- అట్లు గాదు. ఆచార్యుని మాట లేనాఁటికినిఁ బొల్లుపోవునవి గానేఱవు. నలుఁడును నిచ్చటికి వేగిరమ రాఁగలఁడు. ఆయననే దూత్యమునకై వరింతము.

ఇంద్రుఁడు:- (నవ్వి) చేయ నలవి కాదు.

చ. తనపయి సేవిపాత్రె నని ధన్యత దాల్తురు సర్వలోకులుᳲ
దనుజులు దేవవర్యులు దృణంబుగ నేనికి దోఁచుచుండురో
గను లవి వేయియుం నలుముఖంబుఁ గనుంగొన లజ్జ నొందవే
మనుజుని వేఁడికోలు నవమానము నేఁడు భరింపలేనివై.

విశ్వా:- (తనలో) అబ్బా! నూతన మగు యాచన ప్రభువునకు లజ్జాకరముగా నున్నది. నలుని ప్రార్థించుటకన్న వేఱొండుపాయంబును లేదు. ఇది యెట్లు వచ్చెను.

ఇంద్రుఁడు:- దీనిచేతనే. (అని సగము చెప్పఁగానే.)

విశ్వావసు:- తెలిసెను. తెలిసెను. కాని యొరులచే దూత్యము సాగించుట గురువులవారికి సమ్మతము గాదు.

ఇంద్రుఁడు:- ఇట్లును గానిమ్ము. దీనివలన నష్ట మేమి? ఆమె చిత్తవృత్తినైనఁ దెలిసికొన వచ్చును గాన మన కోరిక నిద్దానితో బ్రస్తావింపుము.

విశ్వా:- కానిండు. అదియుఁ జూతము. చేటి నుద్దేశించి సఖీ! మీ రాజపుత్రిని మహేంద్రుఁడు వేఁడుచున్నాఁడని వింటివా?

చేటి:-(దుఃఖముతో) నేన కాదు. ఈ యనర్థమును భర్తృదారికయు వినియుండెను.

ఇంద్రుఁడు:- ఈ ప్రసంగము నింతటితో నాఁపుము. అనర్థ మను మాటచేతన నా వీనుదోయి తనివి దీరెను.

చేటి:- అంతట నలప్రాప్తికి నాతంకము గల్గునో యనుభయమున మదనవేదనకు గుఱియై తొడవులనెల్లఁ దీసివైచి తలిరుసెజ్జ నిలువఁ జాలదు.

చ. అలసి యనంగతాపమున హాయని కుందుచు వెచ్చ నూర్చుచుᳲ
జెలు లిదియేమి మాకెఱుఁగఁజెప్పు మటంచు బలాత్కరించినᳲ
బలుకదు వారిఁగన్గొనదు వల్కఁగ బూనిన నెట్టకేలకుᳲ
నలుఁడు నలుండనుᳲ మఱివినంబడ దింకొకమాట యెన్నడుᳲ.

విశ్వా:- (తనలో) గురునిమాట వినక వచ్చినదానికిఁ దగిన సమాధానము వచ్చినది.

చేటి:- మహారా జెచట నున్నాఁడు ?

ఇంద్రుఁడు:- బైలుదేరినవాఁడు దారిలో నిలుచునా? సమీపించె ననియే యెన్నవలయు.

విశ్వా:- నిజముగాఁ జేరువనే యున్నాఁడు.

చేటి:- నేన యివ్వ డీవృత్తాంతము భర్తృదారికకుఁ దెలుపుదును. నేను బోళగాఁ బ్రేలు చుందునుగాన గార్యాలోచనలలో నిపుణురాలఁ గానని యు ముద్దరాలనని యిట్టిపనులలో నియోగింపఁబడు నేనపండితంమ్మన్య లగువారిముందఱ నగ్రబహుమాన మొందఁగలను.

విశ్వా:- నిజముగా నిది ముగ్ధరాలే. తాననే మనయొద్ద రహస్య వృత్తాంతముల తెలిపుచ్చెను.

ఇంద్రుఁడు:- తాల మెంత తలక్రిందుగా నున్నదో చూడుము.

ఉ. నాదగు పొందు నందు నొక నాతియు నొందదొ దేవమాన్యలా
పైదలు లెందఱో ఘన తపం బొనరింపఁగ నట్టినేను సి
గ్గది వరింపవేఁడిన నుపేక్షవహించుచు గాక చూడుమా
యీ దమయింతి శ్లోకిలెడి నేమనిచెప్పుదు నాయభాగ్యతన్.

ఈ కాంతయుం దాస క్తమగు చిత్తము మరల్పను నలవిగా కున్నది. ఇదిగాక దమయంతి వేడువానినే వేడవలసివచ్చెను.

విశ్వా:- వేడవలసి వచ్చెనని చింతింపఁ బనిలేదు. రాజర్షి యగు నైషధుని మహానుభావత్వము మీ రెఱుంగరా ?

ఇంద్రుఁడు:- ఎవ్వరికిఁ దెలియదు.

శా. పుణ్యశ్లోకుఁడు రూపవిక్రమములన్ ముల్లోకము ల్గెల్చె బ్రా
హ్మణ్యా గణ్యుఁ డశేష సత్కళల గాంభీర్యాబ్ధి ధైర్యాద్రియున్

గణ్యుం డగ్రమునన్ వదాన్యపటలిన్ రాజర్షి వర్యుండు గా
రుణ్యాంభోనిధి యెందు నిట్టిగుణపూర్ణుం డుండునే యేతఱిన్.

విశ్వా:- (తనలో) స్వామి యాచన యన లజ్జపడి యెడినిఁగాన నిది మార్చి చెప్పవలయు (ప్రకాశముగా) సకల లోకనాథులగు దేవరవారు మధ్యమలోక మాత్రనాథుఁడును విధేయుఁడును నగు నలుని గోరుట యాజ్ఞాపనానుగ్రహమే యగుగాని యాచనాదైన్య మెట్లగును.

ఇంద్రుఁడు:-

తే. గీ. దైవము శుభంబు నొడఁగూర్పఁ దలచె నేని
యాచనయు నాజ్ఞయే యయి యమరుచుండు
నట్లు లదిగాక వ్యతిరిక్తమాయె నేని
నాజ్ఞయును యాచనాదైన్య మబ్బఁజేయు.

విశ్వా:- దైవము ప్రతికూలమగుట కేమిప్రసక్తి గలదు ?

ఇంద్రుఁడు:- అది యెట్లున్నను,

చ. తడయక దేవమారకునిఁ దారకునిం దెగటార్చువాఁడనై
కడఁగి సుమాయుధుం గరళకంఠు నుదగ్రపు కంటిమంటలో
మిడుతను జేసియుంటినిజామీ యతఁ డింకనుఁ బూర్వవైరమున్
విడక మదీయ మర్మముల వేధ మొనర్చెడి నేఁడు చూడుమా.

(తెరలో) భగవతి సావిత్రీ ! వచ్చెను. వచ్చెను.

విశ్వా:-ఇటకు విదర్భపతి యంతఃపురాంగనలు వచ్చునట్లు దోఁచెడిని గాన మన మిటనుండి తరలి యింకొకచోట నలునిరాక వేచి యుందము. (అని పోవుదురు.)

మహేంద్రోద్యోగము అను ద్వితీయాంకము.



శ్రీ శివాభ్యాం నమః

# నలవిలాసము

## తృతీయాంకము

(అమాత్య కామందకుఁడు చింత నటించుచు బుద్ధిసాగరునితోఁ ప్రవేశించును.)

కామందకుఁడు:- మిత్రుఁడా! మహారాజు విదర్భజాయత్త చిత్తుఁడై సామ్రాజ్యభారము నంతను మనయందు యునిచెను. సకల ద్వీపసామ్రాజ్య నిర్వహణము దుశ్శక్యము గదా?

బుద్ధిసాగరుఁడు:- మహారాజేనాఁడును వ్యసనములకు నెడము నిడువాఁడు గాఁడే! నేఁడిట్లేల సంభవించెను?

కామం:- నీవన్నది నిజమే. ఐన దైవవశమునఁ గలవచ్చుటచే నది మొదలుగాఁ గామపరాధీనుం డగుట గలిగెను. ఇది భవితవ్యతాప్రభావముగాని ప్రభువునకు సహజభువు గాదు.

బుద్ధిసా: మీరు సామ్రాజ్యధౌరంధర్యమునకై విచారింపనిది క్రొత్త గాదు గదా. చక్రవర్తి యేనాఁడును వైరిసంహారణమో లేఖర్షభసాహాయ్యకమో దానవ నిషూదనమో మొదలగు పనులయెడనే గాక సామ్రాజ్యచింత యావంతయేని నెన్నఁడేని వహించెనా. అంతయు మీయందు నిలిపియుండెఁ గదా!

కామం:- నిజమే. ఇప్పు డాస్థానగమన సమయ మాసన్నమయ్యెఁ గానఁ బోవుదము. (అని పోవుదురు.)

అంతట కామపరాధీనుండగు రాజు నిట్టూర్పు విడచుచు విదూషకునితోఁ ప్రవేశించును.)

రాజు:- చారాయణ! నేను పూర్వరాగముచే నెంత యిక్కట్టునఁ బడఁద్రోయఁ బడితిని. చూడుము.

ఉ. ప్రీతి మనోజయాజి యలభీమసుతారణి రాజహంస వి
ఖ్యాత తదుత్తరారణి యుగంబునఁ బుట్టిన రాగపావకుఁ
డా తనువేది నిల్పెఁ బసి నామది హవ్యము హోత యిందుఁ డు
ద్గాత మధుండు ఋత్విజులు దక్షిణశైలజ గంధవాహముల్.

ఈ యాగ మంతయు రాయంచ మాటచేఁ బ్రవర్తించుచున్నది. హంసరాజు వచనంబును దప్పిపోవునా? దైవోపహతునకు నసంభావ్య మేమి? వసంతుఁడు నిప్పుడ రావలయునా? వీని నిప్పుడు నిందింప నేల?

ఉ. ఆమని మున్ను మాకుఁ బ్రమదాతిశయం బొదవింపకుండెనే!
కాముఁడు మార్గదర్శకుఁడు గాఁడె! రుచింపఁడె దక్షిణానిలుం
డే మరి రుచ్యవస్తువులనే విరసంబులఁ జేయు దాతచే
నా మయశాలివోలె నిటు లందితి దుర్దశ నేమిసేయుదున్.

ఉ. కాముని నల్లనీ! యొడలు గాలిన వానికి దండ మేటికిన్
సోముని వెల్లనీ క్షయము సోఁకినవాని శపింపనేల? యో
రీ మధునామ! నీ బ్రదుకు రెండె నెలల్గఁ గుదించియున్న న
ట్లామికమూని కాముకుల నాకలపెట్టెదవో? వచింపుమా?

ప్రసూనచాపుని ప్రతాపము సంతాపము గల్గించెడిని.

ఉ. పండఁగఁ జేయుదుం జలధు లేడిటి నీ రెగజిమ్మి సుంతలోఁ
గొండలఁ బిండిగా నలఁగగొట్టి క్షణంబున రూపుమాపుదున్
భండనకేళి దానవులఁ బారఁగఁ దోలుదుఁగాని పుష్పకో
దండుని తూపులం గలుగు తాపము నోప నిఁకేమి సేయుదున్.

భైమిని గనునుపాయ మేమి? నిజముగా నిప్పని దుర్ఘటమే.
(అని చింతను నటించుచుండును. భయ వినయములతోఁ బ్రవేశించి)

సేనాని:- దేవా! విదర్భలనుండి యీ లేఖ వచ్చెను. [విలోకింపుఁడని పత్రిక నిచ్చును.]

రాజు:- (హర్షముతో) తడబడుచు దానిని విచ్చి చదువుచున్నాఁడు.

'స్వస్తి శ్రీ రాజాధిరాజ రాజపరమేశ్వర జగతీశ్వరులగు
చక్రవర్తిగారి చరణ సరసిజ సన్నిధికి —

క్రథ కైశిక దేశాధిపుఁడు భీముఁ డనేక ప్రణామము లొనరించుచు గావించు విజ్ఞాపనము ఏమన? ఇచ్చట నేము చక్రవర్తిగారి కృపచేఁ గుశలముతో నున్నారము. తరువాత ఏను చాలకాలము సంతతిలేమికి సంతాపమంది యదృష్టవశమున దమనమహామునీన్ద్రు సపత్నీకుఁడనై సేవించి యమ్మహామునియు ప్రసాదమున ముప్వురు గుమారులను నొక కొమరితను బడసితిని. దమయంతి యనుపేర దేవకన్యంబోలు నీ కన్యారత్నమును స్వయంవరమున నే పతిని వరింపఁ జేయ నుద్దేశించి యెల్లసంభారముల నాయత్తపరచితి. మాఖ శుద్ధ త్రయోదశీ శుక్రవాసరమున స్వయంవరము నిశ్చయింపఁబడియెఁ గావున సార్వభౌమచరణము లిటకు సన్నిహితులరై యనుగ్రహింప వేఁడుచున్నాఁడ.

వృషసం } ఇట్లు
మాఖ శు॥ 3లు } భీముని హస్తాక్షరములు

సేనాని:- శ్లాఘించుచు (తనలో) లేఖపద్ధతి యెంతయో బాగుగా నున్నది. (ప్రకాశముగా) దేవా! స్వయంవరమునకుఁ బోవ నావశ్యకమే గదా?

రాజు:- (తనలో) సంతసపడుచు భైమిని గనుటకు సమయము వచ్చినటు లున్నదిగాన బోఁగలను. ఈశ్వరేచ్ఛ యెటులున్నదో? (ప్రకాశముగా) విదర్భుల కేగ మనసేన నర్ధక్షణముననే యాయత్తపరుపుము.

సేనాని:- దేవరవారి యాజ్ఞ. (అని పోవును.)

రాజు:- (లేచి విరక్తి నటించుచు) చింతతో ఇట్టి నే నెట్లు నిశ్చంకముగా స్వయంవర సమాజ మండపమునకుఁ బోవుదును. ఏమన?

చ. మనసిజుఁ జేరనీక యసమానధృతిం బ్రతి లేనివాఁడనౌ
నను మును గానగన్ భయవినమ్రత నొందు ధరాధినాయకుల్
వనితను వేఁడి నేఁడు నరపాలురతో సరిగా వసించునన్
గనుఁగొని చుల్కఁజూచుచు బ్రకాశముగా గుములై హసింపరే.

పోనిమ్ము. ఇపుడు స్వయంవరమునకుఁ బోవనేల? సభా మండపముఁ జూడనేల? ఏమన?

ఉ. అందమునందుఁ బేర్వడిన దా దమయంతి జగత్త్రయంబునం
దెందటో దేవమానవుల నెక్కుడు చక్కనివార లుండరే?
యందు మఱొక్కనిన్ మమునొ యాజలజాక్షి వరించినంతనే
యిందు విరోధకార్య ముదయింపదె కష్టమునుం బరంబునన్.

(మెల్లగా నడచుచు నడకసాగమి నభినయించుచు దుఃఖముతో పూత్కారము విడుచుచు)

తే॥ గీ॥ ముందునకు లాగుచున్నది డెంద మకట!
దాని కనుగుణముగనె పాదములుసాగె
నట్లుగాకున్న నెందుఁగా మార్గితులకు
మానమవమానమను నాహ మహిని గలదె.

కాఁన బోయెదను. లేకున్న మదనుఁడు బ్రతుకనియ్యఁడుగదా! (కొంచెము నడచి ముందఱజూచి ఆతురపడుచు) అయ్యో! ఇదియేమి. మన సేనానియు నాలస్యము సేయుచున్నాఁడు.

(సేనాపతి ప్రవేశించి)

సేనా:- పట్టఁపు టేనుఁగుతోఁ గూడ సేన సిద్ధ మయినది.

రాజు:- (హర్షముతో) మంచిది. కార్యసహాయుఁడా! సముయజ్ఞుఁడవు. ఉపవనము నిర్గమించుదారిఁ జూపుము.

సేనా:- దేవా! ఇటు ఇటు అని చెయ్యిపట్టుకొని తీసుకొని పోవును.

(అనంతరము రథముతో సారధి ప్రవేశించును.)

(అరచేయి చూచుకొనుచు) ఎన్నాళ్లకో పగ్గములు పట్టుట సంభవించెఁగాన నలవాటున్నను చేయి యెఱ్ఱవాఱెను.

తే॥ గీ॥ బాల్యమునఁ జక్రవర్తి తాపదవి నొంది
జవ్వనమున మహోత్సవశాలియైన
విభునియాశ్రయమునఁబోలె వీరసేన
సాహసాంక మహాశోభ సంతరించె.

రాజు:- (నడచుచు, తనలో) నా మనోరథ మెట్లు ఫలించును ?

సేనాపతి:- దేవరవారి మనోరథమో యన రథము వచ్చెను. విలోకింపుడు. (అని రథము జూపును.)

రాజు:- ( చూచి, తనలో ) ఉపశ్రుతి అనుకూలముగా నున్నది. యిందు నీశ్వరుఁడే సాక్షాత్తు నిమిత్తము, ( ప్రకాశముగా ) సారధి క్రొత్తవాఁడా యేమి ?

సేనాపతి:- కాదు కాదు. మునుపటి వార్ష్ణేయుఁడే.

రాజు:- చాలకాలమునాఁడు గనియుంటచేఁ గనిపట్టఁజాల నైతి.

సారథి:- ఆయుష్మంతుఁడా! జయము కలుగుఁ గాక. రథమును సారథి ననుగ్రహింపుఁడు.

రాజు:- శుభము. రథము నధిష్ఠించు దారి జూపుము.

సారథి:- ఆయుష్మంతుఁడా? యిటు యిటు. అని చెయ్యివట్టుకొని రథ మెక్కించును.

రాజు:- (రథారోహణము నటించుచు) తిరిగి జూచి సేనాని! రథము గదలఁగనే నీవు సేనతో సాగుము. ఆలస్యము సేయకుము.

సేనాని:- దేవరయాజ్ఞ.

రాజు:- (రథమునఁ గూర్చుండి) సూతా! గుఱ్ఱములఁ దోలుము.

సారథి:- (గుఱ్ఱములఁ దోలుచు) రథవేగము నిరూపించి,

మ. గడెలో భూతల మెల్ల దాఁటు దృఢజంఘుల్ గల్గు మాకిప్డు బె
త్తెడు మాత్రంపు విదర్భ లేగుటయ కీర్తింగొల్పదే యంచునో
కడఁకన్ మోములు వాంచి లజ్జకడిమిన్ గంపించు ముంగాళ్లతో
బుడమిన్ వ్రాయుచుఁబోవుచుండెఁగనుమీ భూపేంద్ర! యీయారథ్యముల్

రాజు:- ఈ యశ్వములు మనోవేగము మించిన వేగము గలవియే.

తే. గీ. నా మనోరథముంబూని నా మనోళి
యిప్పుడు విదర్భలకుఁజేర్చె నెంతయొవడి
నంతకన్న మహావేగ మతిశయిల్ల
రథము జేర్చుచునున్నది రథ్యచయము.

(వెనుకఁ జూచి) నిమధదేశము లెపుడో దాటిపోయెను.

సారథి:- ఆయుష్మంతుఁడా! క్రథ కైశిక దేశములలోఁ బ్రవేశించితిమి.

రాజు:- (ఆశ్చర్యముతో ముందఱఁ జూచి) ఇట సరసులలోని తమ్మి పువ్వుల సుగంధము లపహరించి పూదీవపొదరిండ్లలో వీచు మందమారుతములతోఁదనరు రాజోపవనప్రదేశము లెంతయో మనోహరములుగా నున్నవి. పులకలెగయ (తనలో)చింతతో భువినో దివినో భాగ్యవంతు లుండరా?

(తెరలో)

శా. శ్వేతచ్ఛత్రసితధ్వజాదుల స్ఫురచ్ఛ్రీ పూర్తి నంతశ్శమో
పేతుండౌట మహర్షివర్యుఁడో మహావీరుండో నాశూర్పశా
రాతిన్ విస్మితుఁజేయు సోయగమునన్ రంజిల్లుచున్ వచ్చువాఁ
డీతండెవ్వఁడొకో వచింపుము పరేతేశా విమర్శంబుగాన్.

రాజు:- విని వార్ష్ణేయా! మన్ద్రమధురమగు నీ కంఠధ్వని క్రొత్తదిగా నున్నది.

సారథి:- ఆయుష్మంతుఁడా! ఇది మనుష్యుల గొంతుగాదు. కాన నెవ్వనిదో తెలియదు,

చ॥ జలమున నద్వితీయుఁడయి బాల్యము దాటఁగనే సమస్తభూ
తలమునఁ జక్రవర్తి బిరుదంబును నాటె విభేదభావము
ల్గల రిపుకోటియెల్ల ననలప్రవరుండనుచున్ వడంకఁగా
నలుఁ డనుపేరునన్ త్రిభువనంబుల నెన్నికగాంచె నెంతయున్.

రాజు:- ఈ స్వర మింకొకనిదిగా నున్నది.

( మరలఁ దెఱలో )

మహారాజా! ఈ మహాపురుషు నేను నెఱుంగుదును.

చ॥ కనఁడు పరాంగనాముఖము గర్వము నూనఁడమర్ష శాలిగాఁ
డనఁడనృతం బకీర్తికర మాపని నొల్లఁడ ఘంబుసేత గై
కొనఁడు పరార్థ మెల్లెడల గోరఁడు గామసుఖంబు వేఁడఁడీ
జనవరలోకమాన్యునకు సాటినృపుల్ మహినెందు నుందురే॥

రాజు:- సూతా! స్వరము మాటిమాటికి మాఱుచున్నది. ఎవ్వారలో దేవతలు పలువు రున్నట్లు దోఁచెడి. రథము నాపుము. దిక్పతులు సమీపింతురు.

రాజు:- (రథము దిగుటను నటించి) దేవవర్యులారా! వీరసేన సూనుఁడ. నలుఁడ. అభివాదనము సేయుచున్నాఁడను.

దిక్పాలురు:- విజయి వగుము. కీర్తిఁ గాంచుము. ధర్మనిరతుఁడ వగుము. సామ్రాజ్యాభివృద్ధి నొందుము.

అనలుఁడు:- విమలకీర్తిమూర్తి వగునో నలచక్రవర్తీ! అవధరింపుము.

ఉ. ఒక్కొకచో హిమాంశుకళ నొక్కొకప్రొద్దునఁ బంచియానుచున్
జిక్కుచుఁ బ్రాణములుగ్గతిఁ జేరఁ దపించెదు దేవకోట్లు నీ
యక్కటికంబునన్ సతము యజ్ఞహవిస్సుల మెక్కి యల్లమే
నొక్కట బొజ్జఁగా దొరలుచుండిరి నేఁడు నరేంద్రచంద్రమా!

యముఁడు:- పరిపూరితసకలార్థికాముఁడవగునో సార్వభౌమ! ఆకర్ణింపుము.

ఉ. ప్రాహుణికేష్టపూరణము ప్రస్ఫుటమార్గిణంబు నైన నీ
బాహువు చేతఁ గట్టువడి పాకనిషూదనులక్ష్మిస్త్రదైత్యసం
దోహము బ్రహ్మదత్తవరదుస్సహమై యెగలాగుచున్న లో
కేహయుఁ దిర్వరాడునదు గిప్పటికిం గదలింపఁ జాలెనే.

రాజు:- దేవవర్యులాలా! పరమాణువుఁ బర్వతముగా భావించు చందమునఁ గింకరుని నింతగాఁ బొగడుచున్నా రేల? నేను వినఁజాల. పని చెప్పి యనుగ్రహింపుఁడు.

వరుణుఁడు:- అర్థిచకోరరక్షపాకరా? మా వచ్చినపని యాలింపుము.

సీ॥ ఈ దేవవిభుతోట నెల్లకోరికలిడు
కల్పలతలుగల వనల్పసంఖ్య
లీమహేంద్రునిదొడ్డి నెప్పు డుండును సర్వ
కామితంబుల నిచ్చు కామధేను
వీజిష్ణుముంగిట నెసఁగుఁ జింతామణి
చింతితనిఖిలార్థసిద్ధిమూల
మివి యన్నియును నిర్వహింపని దుస్సాధ
కామంబు గలిగె నాఖండలునకు

తే॥ గీ॥ నదిరయొదవఁ జేయ నన్యుల కలవి యగున?
తనరుముల్లోకముల నేకదాత వయిన
నీవ యదితీర్చి జగమున నిరుపమభృశ
యశము నందుము దివి విబుధాళిపొగడ.

రాజు:- అంతమాత్రపుపని కింతపొగడవలయునా? నేను బలునాళ్లనుండి యాచకులనే పొడఁగాననైతి. మఱియుఁ బరమప్రాజ్యులరగు దేవవిభుల మిమ్ములనే వడయగల్గితి నా జనువు సఫలంబయ్యె. సామ్రాజ్యము ప్రాణంబులనైన మీ చరణ సరసిజంబుల నర్పించెద. తడవేల? ఆనతిచ్చి నన్ను ధన్యుఁ గావింపుడు.

వరుణుఁడు:-

ఆ॥ వె॥ నృపవరేణ్య! భైమి నీవశముననుండె
బరమసఖుఁడవీవు బలరిపునకు
గాన వాసవునకుఁ గామినిఁగూర్పుము
జగతి సకలజనులు సన్నుతింప.

మహేం:- ఇందుకులాభరణా! ఏము నల్గురము నేక కార్యార్థుల ముగా నరుదెంచితిమి గాన నా కొక్కనికే భైమిని గూర్పు మనుట పాడిగాదు. మా నలువురలో నెవ్వనినైన భైమి వరించునట్లు నీవు దౌత్యంబు నిర్వహించి సత్యప్రతిజ్ఞుఁడ వగుము.

రాజు:- (తనలో) దిక్పాలురు వంచనాపరులుగా నున్నారు. కాదేని నా కామించుకాంతనే యేలఁగూర్పుమందురు? వీరికిట్లు బదు లాడవలయును. భువనాధీశ్వరులారా! మీ రెఱుఁగనిధర్మ ముండదు. ఏను గోరు కన్నెను మాకు గూర్పుమనుట పాడి యగునె? యిందు నన్ను గుంటితనమున నియోగించుట గొంటెతనముగదా! ఆడి తప్ప నేర, నింకొకండుగోరు డెద్ది యైన నొడఁగూర్తును.

మహేం:- వేడిని దింతచక్కఁజేసితివి యింకొకండయినచో నొసంగు దువుగాబోలు; చాలును నీత్యాగశీలత సత్యనిష్ఠయు నొక్క యెడనే తెల్లమయ్యెను. మొదలేయడుగ వలదనినచో నిన్నుఁ బీడింతుమే! ఏము లోకపాలురము యాచ్ఞాదైన్యము ననుభ వించి పూర్ణకాములముగాక తొలఁగువారమె యిందు నిష్క ల్మషముగ దౌత్యంబు నిర్వహింపుము. శిలయగు చింతామణి చెట్లగు గల్పతరువులు పసరమగు గామధేనువు మాటాడక కామితంబు లొసంగుట యెఱుంగవే. అస్థిరంబగు కామసుఖం బునకై సుస్థిరయశంబు నసింపఁజేసికొనకుము. సత్యప్రతిజ్ఞుఁ డవగుము.

రాజు:- (తనలో) భైమినిఁ పరిగ్రహింపకున్న బ్రాణము నిలువదు దేవదౌత్యమునకు నొడఁబడకున్న గీర్తి నిలువదు. ఇది నన్నుఁ బరీక్షింపఁ బ్రాపించిన దైవయోగంబుగాఁ దోఁచెడి నిప్పుడు వెనుదీయుట యకీర్తికరము గావున నిప్పని కొడఁబడుదును. బ్రాణహాని యశోహానికన్న నెక్కుడు గాదుగదా!

రాజు:- (ప్రకాశముగా) సురవర్యులారా సూర్యకిరణంబులును జొరఁ
రానికన్యాంతఃపురము నే నెట్లు వోవ నగును!

మహేం:- ఇదిగో తిరస్కరిణి నొసంగు చున్నాడ దీని ప్రభావంబున
నిన్ను నెవ్వారును గనుఁగొనజాలరు గాని నిశ్శంకముగా
నరిగి కార్యంబు సాధింపుము.

రాజు:- సురవర్యులారా ?

ఉ. మెట్టుకుదూతనై చనుదు మీావయిరాగము భీమపుత్రికిం
బుట్టువిధంబునం దగుప్రబోధము దవ్వక యాచరింతు మీా
యట్టి జగన్నుతార్థి జనతాభి మతార్థము దీర్పకుందు నే
గట్టిగ జెప్పజాలనిఁక గామిని గూర్చెదనందు జూడుడీ!

మహే:- నిషధాధిపా! పొమ్ము. కార్యము సాధింపుము ఏము కృత
కృత్యుఁడవగు నీరాక నిరీక్షించు చుందుము.

(అని నిష్క్రమింతురు)

రాజు:- చారాయణా విధినియోగ మెట్లు పర్యవసించెనో చూచు
చున్నాఁడవు గదా!

విదూ:- కర్ణదధీచి ప్రముఖు లగుదాతల నెందరనో యాచింపఁగా
నఱిగిపోయిన నాలుకగలిగి సహజశత్రుఁడగు నీ శత్రునియందు
నీ కింతగౌరవబుద్ధి యేల? ఇతఁడు వేడినమాత్రమున నా కన్యా
రత్నమును విడువ గూడదు.

రాజు:- ఇది యంతయు నిజమేయైనను ప్రతిన భంగ మగునను భయ
మున నట్లే యని దాని కొడంబడితిని.

విదూ:- పరమేశ్వరునిదయచే నట్ల గానిమ్ము. ఇఁక జీవింపఁ గలను.
ఏమన కలగన్నది మొదలుకొనియున్మత్తునివలెను, గ్రహము
పట్టినవానివలెను, అతిమూఢునివలెను శూన్యహృదయుఁ
డవై పలువిధములఁ బ్రలపించుచు నేమేమియో చింతించు
చున్న నిన్నేకహృదయునివోలె దుఃఖ మనుభవించుచు

నూ అడించుచు ననేకవిధముల రేలుంబవళ్లు నిద్రాహారములు విడిచి మాయమ్మకు నేకపుత్రుఁడ నగునేను పరితపించు చుంటిని. ఇవ్వని నెట్టు లారంభించితివి, ఎట్లు ముగించితివి! కానిమ్ము కొన కేమి నిశ్చయించితివో చెప్పుము.

రాజు:- (నవ్వి) సఖుఁడా! నలుఁడేమి నిశ్చయింపవలయునో నీవ యోజింపుము. ఏమన,

ఉ॥ ఆముకొనఁగ యశంబు వలదంటవొ సంగున నెట్లొనర్తు న
త్రాముని కోర్కి దీర్పక సుధాకరుగోత్ర మకీర్తిపాత్రముగ
నామసకంబుఁ గోరి మదనజ్వలితాఖిలగాత్ర యీమెయా
భైమిని నేనపోవిడిచి ప్రాణము లెట్లు భరింతు రిత్తగాగ.

కాన నీశ్వర సంకల్ప మేమి గావింప నున్నదో గోచరింపదు. మన యత్నము నిరర్థకమే (అని పోవుదురు.)

దూత్యవరణము తృతీయాంకము

---

గురుభ్యోనమః

# నలవిలాసము

## చతుర్థాంకము

సావిత్రి, వేగిర పడుచున్న చేటియు ప్రవేశించుదురు.

సావిత్రి:- అనంగలతా! ఆ మహారా జెచ్చట నున్నాఁడు.

అనం:- ఉపవనముదగ్గఱనే చంద్రుఁడుదయించు నప్పటి జలధిఘోషముం బురణించు నైషధునిరథధ్వని మీకు వినఁబడుటలేదా!

సావిత్రి:- ( చెవి నటునునిచి, సంతసముతో ) నీవు పోయి యీ వృత్తాంతము భగవతి యగు సరస్వతికి నివేదింపుము.

అనం:- మీ రెక్కడికి బోవలయు ?

సావిత్రి:- నేను మిగుల నస్వస్థ యగుదమయంతిని భీముని కులదేవతయైన గౌరీదేవిపాదసన్నిధికిఁ గొనిపొమ్మని సరస్వతిచే ననుపఁబడితిని. నీవును పోయి సరస్వతినిఁ బ్రయాణము సేయుము.

అనంగ:- చిత్తము.

సావిత్రి:- ముందఱఁజూచి దమయంతి యిచ్చటనే యున్నది. ఈమె మదనునిచే మిగుల బాధింపఁబడు చున్నది. దగ్గఱ నుండి వత్సను ప్రయాణము సేయింతును.

(ఇది అంకాస్యము.)

---

(అనంతరము దమయంతి చెలులతోఁ బ్రవేశించును.)

దమ:- (ఉత్కంఠతో) సారంగికా! చెప్పుము. నా ప్రాణముతోడు నీ చెప్పినమాట నిజమా? లేక నుబుసు బుచ్చనో? పరిహాస మునకో? చెప్పుము.

సారం:- ఇందు సందియమేమి? మీ యొద్ద నే నెన్నడును నసత్యము విన్నవింపను.

దమ:- అసే! చంద్రకళా! నిజము చెప్పనదే మైననిది ముద్దరా లగుట సారంగిక మాటలమీద నాకు నమ్మకము లేదు.

సారం:- నా మూఢత నేకార్యంబునఁ గనిపట్టితిరి? నే నిప్పుడు భద్ర ముఖునిఁజూచి మాటలాడితిని.

చంద్ర:- ఓసీ! వాసంతికా! భర్తృదారిక బాగుగా శంకించినది. ఎట్లన, భద్రముఖుఁడు నిన్నవచ్చి యప్పుడ వెడలిపోయెను. ఇప్పుడిది ఎవ్వనితో మాటలాడెనో? తెలిసికొనుము.

దమ:- (చేయి నెడద నిడుకొని) ఇదియు వింతయే యాయెనా? ఈ వార్తయు దురదృష్ట నగు నాయెడ నసత్య మయ్యెను. వాసం తికా! ఇది యిప్పు డెవ్వానితో నా వృత్తాంత మంతయుఁ జాటెనో? అడుగుము.

వాసం:- సారంగికా! భద్రముఖుఁ డెట్లుండెనో? చెప్పుము.

సారం:- నన్నింత ముద్దుగాఁ దలంచెదవు? భద్రముఖుని నే నెఱుంగనా? అతఁడు రెండవ నైషధుఁడే! తొడవులు నాతనికిఁ దగునట్లే యున్నవి. ఇరువదియైదేండ్ల ప్రాయముననున్నాఁడు. వాఁడును భర్తృదారికసంగతి చెప్పుచున్న నన్నుఁ గన్నా ర్పకచూచి మాటాడెను.

చంద్ర:- అయ్యో! దీనిమాటలు నూడ వాఁడెవఁడో! దేవుఁడుగఁ దోచెడిని.

దమ:- (విభ్రాంతితో) ఇప్పుడు విన్నమాట నిజమా?

వాసం:- ఇది నిజమని యెవ్వరు చెప్పిరి?

దమ:- నే నట్లు చెప్పను. పెద్ద లిట్లు నుడువుచున్నారు.

తే॥ గీ॥ ప్రజలవాక్కు ఫలింపదు ప్రచురమయ్యె
మేలు నిడునదిగా నది మెలఁగనేని
పౌడమి సంతన సఫలమా పుడమియందుఁ
గీడు నిడునదిగానది కూడెనేని.

చంద్ర:- వాఁడు దేవుఁడేయగు. సారంగికా! వానికిఁ గన్ను లెన్ని యుండెనో చెప్పుము.

సారం:- (కోపముతో) మనుజులకుఁ గాళ్లెన్ని యుండునో, చేతు లెన్నియో నీవు చెప్పుము.

దమ:- అతఁడు సహస్రలోచనుఁడు గాడు. ఇఁక వానిసఖుఁడగు విశ్వావసుఁడే కావలయు. విశ్వావసుఁడు మహేంద్రునిలో బైలుదేఱెనని వింటిమి. అయ్యో! అయ్యో! మహేంద్రుఁడే నన్ను గోరుచున్నాఁడు. ఇఁక నెట్టులా మహాపురుషు నెడ గలపేరాస ఫలించును? (అని యేడ్చుచుండును.)

చంద్ర:- సఖీ! దమయంతీ! అట్లుగాదు. వినుము.

ఉ॥ స్నానము సేయవైతి వళినంబు గనుంగొనవైతి వాటలే
మానితి మాటలాడుటయు మానితి నైన సఖీ యదెట్టులో
మేనున నిల్చెఁ బ్రాణములు మిన్నకయుండక యింతనైన న
ద్దానికిఁబూని యేడ్చెదవు తల్లడపాటున నాత్మఘాతినీ?

(తెరలో)

చారాయణా! అనుచరులను బొమ్మనుము. ఏమిట నుండితి మని యేరికినిఁదెలుప వలదనియు జెప్పుము.

దమయంతి:- తహాతహా పడుచు ఎక్కడనుండియో మాటలువినఁబడు చున్నవి.

వాసంతిక:- మహేంద్రుఁడే వచ్చియుండెనా ?

చంద్రకల:- నీయూహ సరికాదు. విచ్చిన కడిమపూవులఁబలె విలసిల్లు ప్రియసఖి యవయవంబులఁ గనవేమి ? కావున నలమహారాజే సమీపించెనని తోఁచెడిని.

దమయంతి:- (లజ్జా విస్మయములతో) ప్రియంవదా ! ప్రాణము వోయినవానినైన బ్రదికింపనేర్తునని యెఱుంగుదును. చంద్రకలమాట నిజమగునా ? అన్నివిధములనిది దాపున నుండఁగూడదు. కాసమ్మ ఇంతనైన (ప్రకాశముగా) సారంగికా ! మేమిచ్చటనుంటి మని సరస్వతీదేవికి నివేదింపుము.

సారంగిక:- భట్టిని చిత్తము,

తిరిగి తెరలో

మిత్రుఁడా ? యిటురమ్మ

విదూ:- ఈ పొదరింటిలో నీకిపుడు చిత్రమును జూపింతును.

దమయంతి:- చంద్రకలా ! మరల మాట వినబడుచున్నది. అంతటను వెదకుము.

చంద్రకల:- (పోయిచూచి) భయశీలురాలా ! యిచ్చట నెవ్వారును లేరు.

( అనంతరము మదనావస్థ గలరాజు విదూషకుడును ప్రవేశింతురు. )

రాజు:- ఇచట నాశ్చర్య మేమి ?

విదూ:- ఎదురుగాఁ జూడుము,

రాజు:- (ఎదుర నాశ్చర్యముగాఁ జూచి)

చ. నది యననీరువాఱు నయనద్వయి నల్లన నేలఁజూచుచుꣳ
బెదవులు పొక్కిపవ్వ్య వెతపెంపున కోర్వక వెచ్చనూర్చుచుꣳ
జెదరినవెంద్రుకల్ సెలగఁ జిక్కిన చెక్కిలి చేతఁదాల్చి నీ
ముదితఁను గుందఁజేయువిధిమోహితుఁడౌదురదృష్టుఁడెవ్వఁడో?

తిరిగి (హర్షముతో) ఈరూపు కలలో నగపడిన దానింబోలి నట్లున్నది. పోలినట్లేమి? పోలియే యున్నది.

ఉ. చిక్కదనంబుతో నిదుపుఁజెందిన యీ జడఁజూడ నద్దియే
చక్కదనంబు సిక్కన నిశాకరు దూరెడుమోము నద్దియే
చిక్కన దీతనూలత విశేష మిదొక్కటిదక్క యింక లే
దక్కలదోచెనో మరల నక్కట యిత్తతి నేమి సేయుదుఁగా.

విదూ:- ఆమెయే యీమె.

రాజు:- అట్లేయగునేని బ్రదుక నగుఁగాని, యామెయే యీమె యనుట యెట్లు? నామనసునుబట్టి చెప్పుచున్నాఁడ వేమో?

విదూ:- అట్లనకుము యిందుఁబ్రమాణము గలదు. ఏమన చారుని వలన నీవెట్లువినియుంటివో కలలో నెట్లు గనియుంటివో నేనును చిత్రపటమున నెట్లుజూచితినో యీ యాకారము విని కనిన దానింబోలి యున్నది. ఈయుద్యానము కుండిన పురప్రాంతము విరహాము చేఁ గృశించిన యీ కారముంబట్టియు శారదాదేవి నీకనిచిన వార్తంబట్టియు నీచూపామె యందు లగ్నమగుటం బట్టియు నామెయే యీమె యగుట నిజము.

రాజు:- (నవ్వి) ఇదంతయు సరిపోయెను గాని, ఇంతమాత్రమున నామెయేయన నెట్లగును?

విదూ:- రాగము మితిమీఱి యంతటను సందియముసే గలిగించెడిని.

రాజు:- కానిమ్ము; ఈ కాంత నెచ్చెలులతో నుడువు మాటలనుబట్టి నిజము దెలిసికొందము. (అని మెదలకుందురు)

దమ:- పొందరాని కోరికపెట్టుకొని రిత్తగా మిమ్ములఁ గష్టపెట్టితిని. నిషధ దేశము లెక్కడ? విదర్భ లెక్కడ? ఎట్లును నా మనోరథ మీడేఱునది గాదు.

విదూ:- వినవలసినమాట వినఁబడియె. ఇందు నీ కింకను సందియము గలదా?

రాజు:- సరిపోవు చున్నటులే యున్నది. కడమ సంగతియు నాల కించితము.

చంద్రకల:-

తే. గీ. దేవతల కోర్కె నేనియుఁ దీర్పఁజెలువఁ
జాలి విలసిల్లు నా తమ్మిచూలి డెంద
మిందు ననుకూల మే యని యెఱిఁగియుండి
యింక దేనికిఁ గుందెద వింతి నీవు?

బ్రహ్మదేవుని చిత్త మట్టిది గాకున్నను నీకు సరస్వతీదేవి యనుగ్రహము చాలదా?

రాజు:- సఖుఁడా! నీమాట నిజమే. ఇక్కార్యంబున శారదాదేవి సాహాయ్యంబును గలదని తెలిసెడిని. అబ్బా! దైవము నతిక్రమింప నలవిగాదు గదా!

చ. వెలఁదికిఁ గన్నతండ్రి యగుభీమమహీపతి మాకు మిత్రుఁడే
పలుకులబోటి పూటయయి పాల్పడుచున్నది నాతిఁ గూర్పఁగాఁ
గలికి మనంబు మా ప్రణయకాంక్షఁ దనర్చెడి నిట్టు లిన్నియుం
దెలిసి యదేమొ నామనసు దెర్లుచునున్నది సందియంబునన్.

దమయంతి:- సరస్వతీదేవి యనుగ్రహము చాలును. అయినను బలవంతుఁడు గోరుచున్నాఁడని దెలియఁగానే నాడెంద మల్లలాడుచున్నది.

విదూ:- ఈమెను ప్రార్థించువాఁ డెవఁడు!

రాజు:- వానిం గూర్చి యాలోచించియుఁ గనిపట్టఁజాల కున్నాను. (ఆలోచించి) 'శారదాదేవి శ్రేయాంసి బహువిఘ్నాని' అని ముందుగానే కబురంపియుండెను. దైవజ్ఞుండును నీవిషయంబున గొప్పయడ్డంకులు గలుగునని యూహించి చెప్పెను. మఱియు నిక్కోమలి దేవతలచేతను గోరఁబడునని విశేషించి చెప్పెను గదా! కావున దేవతలే యీ నాతిని గోరుచున్నారని

తలంతును. (అని దుఃఖము నటించుచు) అయ్యో! విధి అమృతముగురియున ట్లగపడి యగ్నిలోఁ ద్రోయుచున్నాఁడు.

విదూ:- నీవు విచారింప నేల? దేవత లీమెను గోరినను మనము జయించితిమని తలంచుము. వారు నీకన్న బలవంతులుగారు. నాకు నిజము దెలియుఁగదా?

వాసంతిక:- సఖీ! దమయంతీ! ఇందొక యుపాయము నాకుఁ దోఁచుచున్నది.

దమయంతి:- (ఉత్కంఠతో) చెప్పుము. చెప్పుము.

వాసంతిక:- నిషధేశ్వరుఁడు రాకముందే యాయనయొద్దకు వార్తాహారు ననుపుము.

దమయంతి:- నాశ్వాసమయిన శారదాదేవి యాజ్ఞ లేక రానేరదు. దూతి నంపుసంగతి యేమి చెప్పవలయు?

విదూ:- సఖుఁడా! నీవు గనఁబడుట కిదియే మంచిసమయము.

రాజు:- కాదు కాదు. నిట్టూర్పైనను భారతీదేవి యాజ్ఞాధీన మని వినుటలేదా? కావున నా దేవియనుజ్ఞలేక భైమికి గనఁబడుట తగదు. కొంచెముండుము. ఆ దేవియు రానిమ్ము.

వాసం:- సఖీ నీ విప్పు డాలోచించున దేమి?

దమ:- ఏ మాలోచింతును?

మ॥ అనిశం బుజ్జ్వల మై దవం బన వశేషాఙ్గాటవింగాల్చు నీ
యనురాగాగ్ని ఫలంబు నొందకయ దేహంబందు నే యాఅనీ!
యనలజ్వాల నికాయ్యహేయ మగుగాయంబుగా మదిగా రోయుచు
న్మనుపే వోవదలంచు ప్రాణతతిఁ గాముండాస్థమై ద్రుంగనీ.

అని రెండుమాఱులు చదివి (యేడ్చును)

వాసం:- సఖీ! చంద్రికలా! భైమికిఁ గామజ్వరము తీవ్రమయ్యెను. ఉశీరము చందనము ఘనసారము మున్నగు శైత్యోపచార సాధనములఁ గొనిరమ్ము.

చంద్ర:- ( నాట్యముతో నిచ్చును ) అంత నిద్దఱును నుపచరించు చుందురు.

దమ:- కొంచెము గన్నులు మూసి మదనపారవశ్యము నటించుచు చెలు లెక్కడ ? నాపైని శిశిరవస్తువుల నునుచుడు.

చెలులు:- ( గన్నీరు గార్చుచు ) అయ్యో ! అయ్యో ! ఈమెకు మదనవేదన యతితీవ్రమయ్యెను. మనము సేయు శైత్యోపచారములనే యెఱుంగదు.

దమ:- (మదనతాపము నభినయించి) భగవానుఁడా ! మన్మథ ! నీ చరిత్రములు సకలలోక విలక్షణములు. ఏలన—

తే॥ గీ॥ తాఁబడినబాధ నొరునకుఁ దార్పలేదు
జనుఁడు మొఱకైన నందురు జగతి జనులు
గరళకంధరు కనుమంటఁ గాలియుండి
కాల్చెద వదేల నన్నునో కాయజన్మ.

విన్ను వలదనువా రెవ్వరు ? ప్రాణముఁదీసికొన నెంచెదేని నిప్పుడే తీసికొనుము. కాని యొక్కమాటైన నాకు నా మహా పురుషుని మోముఁ గనబఱిచి,

విదూ:- అయ్యో ! అయ్యో ! ఈమెను జూడ శ్వాస మైన యాడు చున్నట్లు లేదు. నీవు చూడుము.

రాజు:- (కన్నీరు గార్చుచు, గద్గద స్వరముతో) చూచుచున్నాను. సఖుఁడా ! చూచుచున్నాను. ఈ కష్టముజూడనే నలుఁడు విధిచే సృజింపఁ బడియెను. చూడు చూడు.

ఉ॥ ఇట్టియవస్థలో నువిద నెట్టనఁ దాయియుఁ జూడఁజాలునే
కొట్టెడుమాగుఁడుగా గనులు ఘూర్ణిల మోమటు ద్రిప్పకుండునే?
యట్టికృశాంగి వజ్రహృదయాధ్యుఁడ నేన కనంగఁజాలితిగా
జట్టున కెక్కడీతఁడని చానను నాకు నజుండు నూపెఁగా !

చెలులు:- (వేగిరపాటుతో) సఖీ! దమయంతీ! ఊరడిల్లుము. ఊఱడిల్లుము అని) ముఖమున విసరుచున్నారు.

దమయంతి:- (నిట్టూర్పు విడిచి) అలవిగాని కోరిక పెట్టుకొని జీవిత సంశయము నొందునాకై మీర లెంతకాల మాయాస పడెదరు?

(తెరలో)

సఖీ! సావిత్రీ! యిప్పటి కిక్కడికి నలుఁడు వచ్చియుండునా?

దమయంతి:- (వేగముగ) చెలులారా! భగవతి మాటవలె నున్నది కాన నా యొడలిమీఁది తామరాకులను తీసివేయుఁడు (తిరిగి తెరలో) ఇక్కడ దమయంతి లేదేమి.

దమయంతి:-సఖీ! చంద్రకలా! తిరిగి దగ్గఱనే మాట వినఁబడుచున్నది గాన భగవతి నన్ను వెదకుచు నిటకే వచ్చునని తలంతును.

[అంతట చెలు లందఱు దమయంతినిఁ జుట్టుకొని యుందురు.]

దమయంతి:- మన మందఱము వినీత వేషములతో దేవి కెదురు బోవలయు.

రాజు:- చారాయణా! ఇప్పుడు భగవతి యగు శారదాదేవిని బ్రత్యక్షముగా దర్శింప నగుఁగాన నొరులకు నందని మహానందము ననుభవింతును.

(పిమ్మట సరస్వతి. సావిత్రియుఁ బ్రవేశింతురు:)

సావిత్రి:- అమ్మా! నీవు నిర్లిప్తురాలవయ్యు దమయంతీ వివాహ వ్యసనమున సుఖదుఃఖములతో నెంతయో సంలిప్తురాలవైతివి.

సరస్వతి:- [నవ్వి] నీ విట్టులనఁగలవని లజ్జ పడుచునే యున్నాను. అయినను మచ్చుపోడిచే స్మృతిలేని దానివోలె నాయంత నేన యిందు సక్తురాల నైతివి. మఱియు నాసాన్నిధ్యముగోరి తపము గావించిన భీముని కోరిక నెగ్గింప భగవంతునిచే ననుమ

తింపఁబడియు, నే నింద యుంటిని. దాని కనుగుణముగా మూర్ఖుఁడుగాని, పండితుఁడుగాని, స్త్రీగాని, పురుషుఁడుగాని యీ దేశమున జనించినవా రందఱును సరస కవులుగాఁ దోఁడఁగిరి.

సావిత్రి:- పూర్వమే నీమనను విదర్భ దేశము లనఁగనే యాసక్తితో నుండును. ఇఁక భగవానుఁడు ననుమతింప నేమి సెప్పవలయు? ఏ దేశమున నావైదర్భిరీతి గలదో!

ఉ. కమ్మనివానిలోఁ బ్రథమగణ్యము గుణ్యము రీతు లన్నిటన్
దొమ్మిదియా రసంబులకు దూర్వహ మైనవిదర్భరీతి వా
క్యమ్మున గల్గువారి కధికామృత మింతటికన్న నెందు స్వ
ర్గమ్మునఁగాని మోక్షమునఁగాని కనంబడ నేర దెంతయున్.

సరస్వతి:- నేను దగ్గఱనుండిన నేమి? ఇప్పటికిని నారంభించినపని నెగ్గ దయ్యెను.

సావిత్రి:- సిద్ధి చేయవనుండఁ జింతింప నేల?

సరస్వతి:- నైషధుఁడు వచ్చుదనుక కార్యము చేరువనున్నదని యేను నమ్మను. ఎప్పుడు స్వప్నదర్శనమూలమున నైషధుఁడు విచారపడుచుండెనని హంసము నతనియొద్దకు ననిచితినో అది మొదలుకొని యూయాస పడుచున్నదానను. నలుఁడు శాంతుఁడు, విజిగీషుఁడు, గంభీరుఁడు, స్వాయత్తకాముఁడును గాన నతఁడు వరించునో లేదో యను విచారముతో నిద్రయు నెఱుంగను. ఒక్కకారణమున గొంచ మూఱడిల్లుచుంటిని. ఏమన,

మ. అననౌ భైమికటాక్షముల్ సవనవానంగాస్త్రసందోహముల్
గన నీయింతి విలాసముల్ మదనభగ్నప్రాణి సంజీవినుల్
గొన కెంతే విరసంబులై మనసు జిక్కుల్ వెట్టు భోగంబులన్
ఘున విజ్ఞానగభీరుఁడౌ నలుఁ డుపేక్షింబోక యాశించు నే.

సావిత్రి:- అదృష్టవశమున నీవు భీమునికై చింతింపఁ బనిలేదు.

సరస్వతి:- సఖీ! అట్లేల చెప్పెదవు. భీమునకు నాయందుఁ గల భక్తి గౌరవ మవాఙ్మానసము. ఇతరులకు నలవిగానిది. నేను రాఁగనే కన్నీరు గార్చుచు డగ్గుత్తికతో నతఁడిట్లనియె.

చం॥ ధనము బలంబు రాజ్యమును దారలు పుత్త్రులు బంధువర్గముఁ
దనువును ప్రాణముల్ పరిజనంబు గృహంబిఁక మిత్రబృందముఁ
బనుపడినట్టి నా వివిధవస్తు సమూహము మూల్యసంగతిం
గొనినది లేక దానమున గొన్నదియో యన నీదిభారతీ.

అదిగాక యీఁటని భార్యలు, పుత్త్రులు, సేవకులును నా యందు నత్యంత భక్తిని నిల్పి యున్నారు. వారిలో నెల్ల మఱియు, నీ దమయంతి.

చం. వినఁగనె లేచునాపలుకు వెంబడివచ్చును నేను పోవ రాఁ
గనెదురునచ్చు. నాదు సముఖంబున నాసన మెక్కనొల్ల దీ
వనితకు భక్తి యుండుత మవశ్యము నెచ్చెలులందుబోలె బెం
పెనయు ప్రియత్వమే గడలనీయదుగా యిఁక నేమిసేయుదుఁ.

(అని కొంచెము నడచి యెదురఁజూచి, హర్షముతో) ముందు ఉనే చంద్రకలా వాసంతికలు వెంబడింప దమయంతి నన్ను నెదుర్కొనుచున్నది, (మరలఁజూచి, దుఃఖముతో) అయ్యో! నేను దగ్గఱ లేమిచే నధికముగా నేడ్చునట్లు తోఁచెడిని.

దమ:- (దగ్గఱకుఁబోయి) భగవతీ! వందనము సేయుచున్నాను.

సరస్వతి:- శీఘ్రముగనే యిష్టుఁడైన భర్తను బొందుము. రమ్మా. (అని కన్నీరు గార్చుచు ప్రేమతో నాలింగనము సేసికొని) అహాహా! దీని యొడలెంత వేడిగానున్నది? సఖీ! ఎప్పుడు శాంతఖేద యగు నీ భైమినిఁ జూడఁగలను.

సావిత్రి:- నీ కీమెయందు నింత యనుగ్రహము గలుగ నీమె దుఃఖ మెట్లు శాంతింప కుండును?

సరస్వతి:- జగజ్జననిదగు చరణారవిందవందనమే భైమి దుఃఖమును వారించునని నే నమ్ముదును. కాన రమ్ము దేవిపాదసన్నిధికిఁ బోదము. (అని యందఱును బోవుచున్నారు.)

రాజు:- సఖుఁడా! కన్యావర్గము పోయెను గాన మనము గూఢముగా దర్శింప నదను గనిపట్టుటకై యెచ్చట దమయంతి సరస్వతియు నుందురో యటకుఁ బోవలయు. (అని ఇద్దఱు బోవుదురు.)

సరస్వతి:- (పోయి యెదురజూచి శిరమున దోయిలినిడుకొని) భగవతి యగు జగజ్జనని యుండు దేవళ మిదియే (యని పోయి)

మ॥ జననీ ధ్యానము సేయజాల నిఁకఁబూజల్ సేయఁగానౌ నె నీ
మనువుల్ బూని జపింపఁజాల మఱి హోమంబెట్లు శక్యంబగుఁ
దనరన్ న్యాసము లుంపఁజాల నిఁకసద్భక్తిన్ బ్రసన్నాత్మవౌ
నిను నేఁ తే శరణంబుసొచ్చితి భవానీ! సత్కృపన్ బ్రోవుమీ.

(అని సావిత్రితోఁ గూడ సాష్టాంగ ప్రణామముచేసి భైమీ! ఇటు రమ్ము.

(దమయంతి సమీపించుచున్నది.)

రాజు:- (ఆశ్చర్యముతో, ఎదుఁజూచి) సఖుఁడా! ఈ కొమ్మ చాటుననుండి శారదాదేవిని దర్శించి కన్నుదోయి సఫలము సేసికొనుము.

చం॥ నరపతులట్టు లెయ్యెడ జనంబుల గొంకక యాజ్ఞవెట్టునో
పరమసుహృద్గణంబువలె బల్కునో యేవి తటస్థవృత్తితో
గురువులవోలె నెయ్యెడ ముదంబు దలిర్చ రసాస్వదంబులై
యరయగ నట్టిశబ్దతతు లన్నియు నీదగు వైభవంబులే.

ఈ దేవి బ్రహ్మను సాక్షాత్తుగా దర్శించిన యోగులకును, దూరమున నుండును. మన సంగతి యేమి చెప్పవలయును?

విదూ:- ఇట్టిదేవియు గౌరీదేవికి వందనముసేయుచున్నది. యిదియేల?

రాజు:- (నవ్వి) మహారాణి దగుమహారాజ్యము. కారణత్రయశక్తి సామ్రాజ్యము నతిశయించి యున్నది.

సరస్వతి:- (దమయంతిని చేతితోఁ బట్టుకొని బిడ్డా) ! అభీష్టము వేడి పరాశక్తికి బ్రణమిల్లుము.

దమయంతి:- (తనలో) నా కింతకన్న నేమియభీష్టము గలదు. ఒక్కమారైనఁ బ్రియునిఁ జూచుటకన్న నేమి కావలయును ? నీ దయయే యెల్లపుడు గల్గియుండునది.

సావిత్రి:- (సరస్వతి నుద్దేశించి) వత్స ! బాగుగా బ్రార్థించెను. ఇది యెల్లకోరికలకు సంగ్రహరూపముగా నున్నది.

రాజు:- ప్రణమిల్లుచున్న దమయంతిని ప్రియమిత్రుఁడు చూచుఁగాక,

చ॥ వృషమనిసోక జానువులు పూర్ణనిశాకరుఁ గేళిసేయు మో
మొడమకరంబునం దునిచి యీశ్వరుపాదపయోజసన్నిధిన్
గుడిచెయిఁ జేర్చి మ్రొక్కులిడు గోమలిఁ జూడఁగ రంగుసింపఁగా
మడిచిన కాముకెక్కు మన మానసముం బెకలించె నియ్యెడన్.

విదూ:- నీ వాలసించ దేల ! ఇద్దేవి యనుగ్రహ మిష్టసిద్ధికి మూల మని యేను పెద్దలవలన వినియుంటిని,

చ॥ ఎడమపదంబు వంచి మఱియించుక వంగిన మోముశ్శోభిలన్
బిడికిటి మొగ్గచే గుణము వినుకొనన్ దవులంగ లాగుచున్
నొడరెడు పార్వతిం దలపఁ దోయజగంధులు మన్మథార్తులై
వడవడచు నాడుచుం బడుచుఁ బాడుచువచ్చి వరింత్రు నిచ్చలుల్.

కావున ముందే యనురాగము గల భైమి కింకను నది దృఢమగుటకై యిట్టి రూపుగల గౌరీదేవినీ ధ్యానముసేసి ప్రణమిల్లుము.

రాజు:- (నవ్వి) ఫలరాష్ట్రవు మోక్షము నేనిఁ దృణముగా నెన్నదగు భగవతీ ప్రసాదమునకు నిదియా ఫలము ! మఱియెట్లు లీ తుచ్ఛకార్యమునకై పరదేవత నర్థింతును.

చ॥ కరులు రథవ్రజంబు తురగంబులు రాజ్యము నిచ్చునంచనా
కర మగుపోకడన్ విడిచి కామిత మీయఁదలంచెదేని నా
హరివిధిముఖ్యు లాసపడునట్టి భవత్కరుణాధిరాజ్య సు
స్థిరరమ నిచ్చి ధన్యు ననుఁ జేయగదమ్మ జగత్కుటుంబినీ.

( అని కన్నులుమోడ్చి ప్రణమిల్లుచున్నాఁడు. )

సరస్వతి:- సఖీ ! సావిత్రి ! దమయంతి బడలి యున్నది. ఎండ తీవ్రముగా నుండెఁగాన నీ మహీపాక్షి చెట్టునీడఁ గొంచెము సేపుందుదము.

సావిత్రి:- ఇది యుచితమే. ( యని దమయంతిని చేయుఁబట్టుకొని చెలులతోఁ గొనిపోవును.)

రాజు:- (కన్నులు దెఱచి) భగవతి యెక్కడ ?

విదూ:- అటు పోయెను. (అని చూపును.)

రాజు:- చారాయణ ! కలకలమువలె నున్నది. ఆలోచింపఁగా సైనికులు నన్ను వెదకుచు వచ్చుచుందురని తలంచెదఁగాన వారిని వారించుటకై నీవ పొమ్ము.

విదూ:- మిత్రునాజ్ఞ. (అని పోవును.)

రాజు:- (హర్షముతో) అహో భగవతి ! నన్నిపుడు వెదకుచున్నది. నేను గనపడుట కిదియే మంచి యదను. ( అని యెదురుగాఁ బోవును. )

సరస్వతి:- (చూచి, తనలో) ఇమ్మహాపురుషుఁడెవ్వఁడో (ఆలోచించి హర్షముతో) తెలిసెను. ఇతఁడు నైషధుఁడే.

రాజు:- కూర్చుండుఁడు, కూర్చుండుఁడు. అపచారము, అపచారము. (అని తొందరఁగాఁ బోయి) అమ్మా ! వీరసేనుని సూనుఁడ నలుఁడనువాఁడ నభివాదము సేయుచున్నాను.

సరస్వతి:- కుశలివై చిరాయు వగునిన్ను నదృష్టవశమునఁ జూచితి. (అని లేవదీసి కౌఁగలించుకొను చున్నది)

సఖులు:- ప్రియసఖికిమ్మహాపురుషునం దిట్టి యభిమాన ముండుట యుక్తమే.

దమయంతి:- (చూచి, చాలసేపు నిట్టూర్పు విడిచి, తనలో) కులదేవతాదర్శన మమోఘము. ఆ దేవి యనుగ్రహము వలననే గదా నాకీ మహాపురుషు సందర్శనము లభించెను.

రాజు:- (సావిత్రినిసమీపించి) భగవతీ! వందనము సేయుచున్నాను.

సావిత్రి:- నీ కోరిక ప్రియసఖ ప్రసాదముచే ఫలించుఁ గాక.

రాజు:- (వినయముతో) నిలుచుండును.

సరస్వతి:- సఖీ! నలునకు నా మీఁదగల భక్తిఁ జూచితివా.

రాజు:- అమ్మా! భక్తియని యానతిచ్చెదరేల? మీరే నిర్హేతుకముగా ననుగ్రహ ముంచితిరి. ఎట్లన,

ఉ. పూవులు గోయుచో నిఁకొక పూవునుగోయుఁగ నద్ది యోపదో
కోవిదకోటి దేనిఁగనఁగోరుఁ జకోరిక చంద్రునింబలెన్
దేవి! భవత్కరంబది నుతింపఁగ నాకు లిఖించెఁ బత్రికన్
నావలె ధన్యుఁడింక భువనంబుల వేఱొకఁ డుండనేర్చునే?

సరస్వతి:- వత్సా! ఇక్కడికి రమ్ము. (అని రాజుతోఁగూడ దమయంతి దగ్గఱఁ గూర్చుండును.)

సరస్వతి:- వత్సా! దమయంతినిఁ బరిగ్రహింపుము.

రాజు:- అమ్మా! మీ యాన నుల్లంఘింపఁజాల నైన నా మనవి నాలించి యనుగ్రహింపుము.

సరస్వతి:- అది యేమి?

రాజు:- దమయంతికి స్వయంవరము ప్రకటిత మయ్యెను. దానింబట్టి యెందఱో యాశపడి రాఁగలరు. అట్టి సందర్భమున నెవ్వరికి దెలియకుండ నేను బరిగ్రహించుట యనుచితముగాఁదోఁచెడిని.

సరస్వతి:- నీ చెప్పినది నిజమే. అయినను నప్పటికిఁ గొన్ని యుద్ధంకులు గలుగనగుఁగాన నిపుడే పరిగ్రహించుట యుక్తమని తోఁచెడిని.

రాజు:- అమ్మా ! నీ యనుగ్రహము గల్గియున్నపుడు నాకు నడ్డంకుల వలని భయ మెక్కడిది ? భవితవ్యత యలంఘనీయముగదా? దయతో సెల వొసంగుఁడు. (అని నిష్క్రమించును.)

(అందఱు నిష్క్రమింతురు.)

ఉత్కంఠ యను చతుర్థాంకము.

---

గురుభ్యో నమః

# నలవిలాసము

## పంచమాంకము

రాజు, విదూషకుఁడు ప్రవేశింతురు.

రాజు:- చారాయణ! దైవము నాచే నెంత యకృత్యము చేయింపఁ దలపెట్టెనో చూడుము.

విదూ:- ఏమది?

రాజు:- దమయంతి కిప్పుడు లోకపాలుర సందేశము వినిపింపక తక్కదు గదా!

విదూ:- నీవు వైదర్భి చెవులలో నిప్పులవాన నెట్లు గురిపింతువు?

రాజు:- సురజ్యేష్ఠుఁ డిట్టి నిష్ఠురకృత్యము లనుష్ఠింపఁజేయుటకే నలుని పుట్టించెను. ఇపుడు దేవదూత్యము నిర్వహింపనేని నసత్యసంధుఁడనై యపప్రథపాలగుదును గదా? ఏమన,

ఉ॥ వచ్చినయర్థి సర్వసురవల్లభుఁడైన త్రిలోకనాయకుం
డిచ్చిన వన్న నన్నభిలషించిన దెవ్వరొ రాజపుత్రి ముం
దిచ్చెదనంచు దాతవలె నేర్పడఁ బల్కితి నింక బొంకఁగా
నచ్చపు నిందువంశమున నాఱనిమచ్చ నిల్పియుండుదున్.

ఏమి సేయుదును?

మ॥ కలచేతన్ మొలకెత్తి హంసవరవాగ్ధారాళిఁ బెంపొంది య
వ్వల వాగ్దేవిలిఖించియుంపినదియా పత్త్రంబునన్ బెద్ద కొ
మ్మలు పెట్టెన్ గనియున్ స్వయంవరపుసంపత్తిన్ వెసన్ బూచి రా
జిలు నా కోరిక దేవదూత్యమున విచ్ఛేదంబు నొందెన్ గటా!

ఉ॥ ఏ పువుఁబోడితో సరస మింపున నాడుచు నాలకించుచున్
గాపుర మాచరింప మదిఁ గౌతుక మందుచు వేచి యుంటినో

యా వువుఁబోఁడి నేన యిపు డన్యులఁగూడుమటంచు వేఁడఁగాఁ
బాపువుబ్రహ్మ నా నొసట వ్రాసెఁగదాయిఁక నేమిసేయుదుర్.

పరమేశ్వరుఁ డేమిగావింపఁ బూనెనో! కానిమ్ము. (అని భైమిని సమీపించును.)

దమ:- (సంభ్రమముతో లేచి) సౌందర్యధుర్యా! ఇది రత్న సింహాసనము. గూర్చుండుము. ఎటనుండి యిటకు నెందులకై యరుదెంచితివో? జయంతుఁడవో? వసంతుఁడవో? కాముఁడవో? సోముఁడవో? లేక నలనాముఁడవో? చెప్పుము. భవాదృశం బైన నాయకరత్నము నేవంశము ధరించెనో? ఏవర్ణంబులు నీ పుణ్యనామంబునకుఁ బ్రకాశంబులో? నీరాకచే నేము ధన్యుల మైతిమి. మా జన్మంబులు సఫలంబు లయ్యె. మా కన్ను లెంతయో పున్నెంబులు సేసె. మావీనులు మీవార్త విననాసపడు చున్నవి. వానికి వాగమృతంబు బ్రసాదింపుము. మా యాతిథ్యంబు పరిగ్రహించి యనుగ్రహింపుము.

రాజు:- ఏను దిక్పాలుర యాస్థానంబునుండి నీకు నతిథినై యరుదెంచితి నా వచ్చినపని దీర్చుటయ యాతిథ్యంబు.

మ. అవధానంబున నున్న దానవె? రహస్యం బిప్పు డాలింపఁగా
దివిషద్వార్త వినంగుతూహలము బుద్ధిం నీకుఁ గల్గుం గదా?
ధవళాక్షీ! పెఱవారు లేరుగద ప్రాంతంబందు నిక్కంబుగా
నువిదా! నీ సఖురాండ్రయాదురుగదా! యిందున్న వారెల్లరున్

అందు సక్రందను వైభవంబు నాలింపుము.

చ॥ సురలకుఁ జక్రవర్తి, పరిశుద్ధయశఃపరిపూర్తియున్ మహా
ధ్వరకలితపూతగాత్రుఁడు విదారితగోత్రుఁడు నబ్జపత్రభా
సురకలితపఙ్క్తినేత్రుఁడు నిషూదితశత్రుఁడు మానిగేయుఁడౌ
హరిహాయుఁ డొప్పు భీతహరిణాక్షి! భవత్పరిరంభణార్థియై.

ఉ. నందననామమౌ నుపవనంబు సుగంధము గుప్పుచుండ నా
నందకరంబు వాసభవనంబు వినంబడు వైజయంతమే

సుందరమై వడిఁ మనసుచొప్పునఁబోవు విమాన మున్న సం
క్రందను నేలి శాశ్వతసుఖాంబుధి దేలుచు నుండు సుందరీ!

ఉ. ఆవులు దూడలు బ్రాకులు సహర్నిశ మిచ్చుచునుండుఁ గోరికల్
మావులు నేన్గు లింక నబలామణు లొప్పు నయోని జన్మముల్
దేవి! యమర్త్యలోకమున దివ్యసుఖంబు లెఱింగినట్టి వా
డీ వసుధానివాససుఖ మెన్నటికేని మదిందలంచునే?

దమ:-

ఉ. వాసవువై భవంబుఁ దెగ వర్ణనఁ జేసితి వింకనావు మా
వాసముదోచుఁ బట్టిదగుబైలున నియ్యది యట్టులుండనీ?
దోసముగాద! యింద్రునకు దోరవుగన్నుల గాథవిన్నచో
హాసము నేవయుంగలుగు నాతనివృత్తము నెత్తవచ్చునే?

రాజు:- దేవీ! నముచిసూదనుఁడు రుచింపదేని శోచిష్కేశుని వరింపుము.

తే. గీ. దేవతాళిముఖం బగిదీప్తిమంతుఁ
డనలుఁడు మనోభవానలహవ్య మగుచు
నిన్ను వేడుచునుండె వినీలవేణి
యాతని వరించి చిరసౌఖ్య మందు మబల?

దమ:-

ఆ. వె. కృష్ణవర్త్మయనునకీర్తిశాలియ గాక
యాశ్రయాశ సంజ్ఞతాపయశుఁడు
నలపతివ్రత నగునాకు నరవరేణ్యా
యనలుపేరు వినగ నౌనె చెపుమ.

రాజు:- మచ్చెకంటీ! చిచ్చు నీకు నచ్చఁడేని దక్షిణాధీశుఁ బరిగ్రహింపుము.

చ. కమలదళాక్షి మంచిచెడుకర్మములన్ గణుతించునట్టి కృ
త్యము గలదక్షిణాధిపతిధర్ముని పాణిఁబరిగ్రహింపు మా

శమను మహాసభాస్థలిని సభ్యపదంబు వహింపఁగోరుచుఁ
సముధిక పుణ్యకర్మములు సల్పుచునుందురు సజ్జనావళుల్

దమ:- ధీనిధీ! కాదనక కొనకు నొల్లక తక్కినివానినే యుపదేశించితివి కాని,

చ. మును వినియుంటి భానుజప్రభుత్వము ప్రేతలపాలియేల్బడిఁ
వనరెడు నారకస్వన విపంచికలాను రసజ్ఞతఁ గనఁ
ఘనతర దండపాశములు గాత్రిరులీచువినీల దేహముఁ
బెను మహిమంపు వాహనము భీతినొసంగెడిఁ ప్రీతినిచ్చునే.

రాజు:- హరిణాక్షి! అరుణాత్మజుఁడు నీమదికింపదేని వరుణునిఁ బరిణయింపుము.

తే, గీ. జలనిధుల కెల్ల నొడయఁడు చంద్రవదన
వరుణుఁడనఁగ ప్రతీచికి వల్లభుండు
వానిదయఁ పేర్మినే వానవడుట బుడమి
పండు నద్దేవు నీవు వివాహ మాడు.

దమ:-

ఉ. ఆపుము నీనివర్ణన జహాత్ముఁడౌట ప్రసిద్ధమేగదా?
కోపములోన బుస్సనెడు ఘోరతరోరగ పాశజాలముఁ
స్వాపమునందుఁ జేవిడడు బాపురె! వాన్మయుఁడై నవానితోఁ
గాపుర మీఁదుటెట్లు! సరిగాఁడపురస్స్యజఁ డీశ నుండనీ!

రాజు:- విదుషీమణీ! తపములచే నయిన దుర్లభులగు దేవవిభుల నుపాలంభించెదేల?

దమయంతి:- సర్వవిధు లగుసయ్యమరేంద్రులు నాడెందం బెఱింగియు నన్నీగతిఁ బీడించుకతన నిట్లనవలసెఁగాని బృందారకవర్యు లను సందెవేళల మూఁడిటను వందనము గావించుచుండుఁ గాని యొకప్పుడేని నిందింతునే?

రాజు:- నీ నిశ్చయ మేమి?

దమయంతి:- నేను నిషధనాథుని వరించియున్నదాన.

రాజు:- ధీమతీ! సురపతులిందఱు కంటకమునకు రోయక నైషధుఁడు నిన్నెట్లు పరిగ్రహింపఁ గలఁడు? అప్పుడు రెంటికిఁ జెడుదువు గదా? తొలుతనె విమర్శించి లోకపాలుర వరించుట శ్రేయము.

దమయంతి:- అప్పటి కర్తవ్యముగూడ ముందుగనే నిశ్చయించి యుంటిని. ఏమన చిచ్చునఁటికిరో, నీరంబులం జేరిరో ఉరిపైచికొనిరో ప్రాణములఁ బ్రాణవిభుఁడగు నలునకే యర్పింతును.

రాజు:- అన్నల మిన్నవగు నీకు నింత సాహసాతిశయము వింత గొల్పదు. కాని యింకొక్కటి వినుము.

దమయంతి:- ఏమది?

రాజు:- చిచ్చునఁటికితేని నగ్నినే వరియించినదాన వగుదువు. నీరమునఁ బ్రవేశించితివేని జలాధిదేవతయగు వరుణునిఁ బరిగ్రహించినదాన వగుదువు. ఉరిపైచుకొని యంతరిక్షమునఁ జేరితివేని దధక్షీశుఁడగు మహేంద్రునిఁ బొందుదువు. ఇఁక నేవిధమున మరణించినను నరుణాత్మజునిఁ గరుణించినదాన వగుదువు. ఇట్లు నీవు మృతినొందినను దిక్పతుల నొల్లక తక్కుదుగాన సమ్మతినొంది వారినే వరించుట శ్రేయము.

దమయంతి:-ఎఱుఁగక యెట్లయినఁ గానిమ్ము ఎఱిఁగి యెట్లు నైషధుని సొత్తు నైన నా తను మనః ప్రాణముల నొరుల కర్పింతును! రూపజిత మీనకేతన యమదూత కెదిరి బాధ యెట్లు తెలియు? దానసే గాఁబోలు పరపురుషస్తుతివాదులను నూదులను నా వీనులలో వేయుచు దూర్చుచున్నాఁడవు. చాలును.

రాజు:- (చింతతో) ఇఁక నేమిసేయవలయు; లోకపాలులారా! వినుచున్నారు గదా. కర్మసాక్షీ! కనుచున్నాఁడవు గదా? భూనభంబులారా! అహోరాత్రంబులారా! నాయందు దోసఁగు లేదుగదా?

దమ:- మహాత్మా ! నీ వంశనామంబులు దెలుపు మని నా యడిగిన ప్రశ్నమునకు నుత్తరము నీ మీఁద నప్పైయున్నది. అది తీర్చుకొనుము.

రాజు: ఏను రాజసూనుఁడ. నా కిప్పుడు ప్రేష్యభావము సంభవించిన కతన నా వంశనామములు వివరింప ననువుగాదు. ( అని తిరోహితుఁడగును.) చారాయణ! శక్తివంచన సేయక దేవదూత్యము నిర్వహించితిఁగాని దేవతల మనోరథము దీర్పఁజాలనైతి.

విదూష:- కాఁబోవుపని తనకిష్టము లేకున్నను దైవము వాని నోరినుండియే వెలువడఁజేయునను జనులవాడుక నిజమే కదా? ఏలన, నిన్ను బ్రార్థించునప్పుడు వరుణుఁడు దుస్సాధకామంబు గలిగె ననుటలో నింద్రుని కోరిక నెరవేఱువది గాదని పలికియే యుండెఁగదా?

రాజు:- (నవ్వి) సఖుఁడా! నీవు సంస్కృతమునను ప్రాగల్భ్యము జూపితివి. అది యట్లే యేర్పడెఁ గదా!

విదూ:- కాననే యుఁకనీవు చక్కెరపాయసము భుజించువాని వోలె చారాయణుని నన్నుఁగూడ మఱచి యానంద సాగరమున మునుంగుదువు గదా?

రాజు:- (నవ్వి) దృష్టాంతము బాగుగా నుపన్యసించితివి (తిరిగి యాలోచించి దుఃఖముతో) అబ్బా! నామనసు నెఱిఁగియు నన్ను వేఱుగ దలంచుచున్నాఁడవు.

శా. కాంతారత్నము నన్ను సుస్థిరమతింగామించెఁగా నాశచీ
కాంతుండంతటివాఁడు వేఁడినఁద్రుణీకారంబు గావించెఁగా
సంతోషింపదు నేడు యాచకజనేచ్ఛాపూర్తి నాశించు నా
స్వాంతం బర్థులకోర్కెఁ దీరుపని లజ్జం ఖిన్నమై యెంతయున్

విదూ:- సఖుఁడా? లెమ్ము. ఈవృత్తాంతము దెలుప నింద్రు నొద్దకు బోవుదము రమ్ము.

రాజు:- (నవ్వి)మహేంద్రుని మనోరథము నీవిధముగాదీర్చి నలుఁడు తాన యతనిసన్నిధికి నెట్లురానేర్చును! ఏను రాఁజాలను, నీవుపోయి తెల్పుము.

విదూ:- కానిమ్ము. నేన పోఁగలను. ఇంద్రుఁడెక్కడ ?

రాజు:- సఖుఁడా! మెల్లఁగా మాటాడుము. మహేంద్రుఁడు విశ్వావసునితోఁగూడ నేరికి గనఁబడకయే మనదగ్గఱనే యుండును. కావున ప్రొద్దుగ్రుంకి చీకటి రాఁగానే రహస్యముగా వచ్చి ప్రత్యుత్తరము సెప్పుమని మహేంద్రుఁడే యాన తిచ్చెను. కానఁ గొంచెమాగుము. ప్రొద్దు గ్రుంకనిమ్ము.

విదూ:- మిత్రుఁడా! భానుఁడస్తమించె నిఁకను కాలము వేఁచ వలయునా ?

రాజు:- (నలుదెసలఁ జూచి)యెట్లు ప్రొద్దుగ్రుంకెను. నేను మధ్యాహ్న మనియే తలంచుచున్నాను.

విదూ:- నే నింద్రు నొద్దకు బోవ నిది సమయమేగదా ? వయస్యా! ఏమి చెప్పవలయు ?

రాజు:- (విరక్తితో) ఇట్లు సెప్పుము. మేము శక్తిగొలది సందేశము బోధింతుమేగాని, కన్నునుగూర్పబూటపడఁజాలమని మున్నే చెప్పియుంటిమి. ఇప్పు డది యట్లే పర్యవసానమాయెనని.

విదూ:- (అటులే యని పోవును.)

రాజు:- ఇంతలో చారాయణుఁడు దేవేంద్రుని గలిసికొని మరలి యుండనగునా ? ఇతఁడు నుడివినమాట నమ్మనా ? (ఎదురఁ జూచి) ఎట్లూ చారాయణుఁడప్పుడే తిరిగి వచ్చుచున్నాఁడు.

(విదూషకుఁడు వేగిరపడుచు బ్రవేశించి)

విదూ:- విజయి వగుము

రాజు:- వేగిరపడు చున్నావేమి ?

విదూ:- ఏమియును లేదు

రాజు:- మహేంద్రుని జూచితివా?

విదూ:- చూచితి, చూచితి.

రాజు:- అవగణనచే వెక్కిరించు చున్నావేమి?

విదూ:- నీవలె నేనుకూడ నాదాసీపుత్రుని నేలసమ్మానింప వలయు?

రాజు:- పాపము శాంతించుఁగాక, పాపము శాంతించుఁగాక. వెక్కిరించు టేగాక బిగ్గరఁగా దిట్టుచున్నాఁడవే! నేచెప్పిన దాయన వేఱు విధముగా గ్రహించెనా?

విదూ:- వేఱువిధముగా నందువేమి! అంతియేగాదు. ఇట్లును

రాజు:- అతఁడిట్లుకూడ నుడివెనా?

విదూ:- నీకు నాయందు నమ్మకములేదా? ఈ యర్థమునే సంగ్రహముగా వ్రాసి నీయొద్ద కనుపఁబోవు చున్నాఁడు. ఆ లేఖ వల్లనే నిజము గ్రహింతువుగాక.

రాజు:- ఇది సంభవింపదు. ఒకప్పటికిని నిట్లు వలుకఁడు. ఈ సందర్భమున మనసు కలఁత నొందుటచేఁ గొంచెము దెగడికచేసి నను ప్రత్యక్షమున నిట్టు లనబోఁడు.

విదూ:- ఇఁక నతఁడు ప్రత్యక్షమున నే యిట్లు నుడువునెడ నేమినిశ్చయింతువు.

( పురుషుఁడు ప్రవేశించును. )

పురు:- ఇదిగో! మహేంద్రుఁడంపినజాబు. (అనిపత్రికబడవైచి వెడలి పోవును)

విదూ:- నామాట ఋజువుగంటివా?

రాజు:- ఇదిచూడఁగనే నాకు నచ్చెరువుగల్గెడిని

విదూ:- పత్రిక చదువుము.

రాజు:- (జాబు తీసికొని విచ్చి మనసున చదువుకొని యటనునిచి యాశ్చర్యముతో) ఆచారమని కొంచెము బహుమానించి

తిమి అంతమాత్రనే తన్ను విశ్వమూర్ధన్యునిగాఁ దలంచుకొను చున్నాఁడు. చూడుము

చ. క్రతువులుసేసె నూతితేఁడాకండని యేరియమర్త్యు లెల్లరున్
బతిగవరించిరం చితనిపై వినయోన్నతి నేము నూప స
మ్మతినడ కిట్టు లల్పమతి మాయెడఁగూడ నదెట్లొ ప్రాభ వో
ద్ధతి వహియించె దౌర్మ్యమున దానికిఁ దగ్గచికిత్స యొప్ప దే.

నీచే నేమవమానింపఁబడితిమి నీకుఁదగిన ప్రతిక్రియ యొనర్పఁ గలము అని గర్వోత్తుప్రసంగ మెంతయో గావించెను.

విదూ:- ఇది యెంతపని! యీసందర్భమున నీవు గోపింపఁబనియేమి?

రాజు:- సఖుఁడా? నిజమే.

ఉ. మాధుఁడు ప్రేలినంతన ప్రమోదమొగాని యమర్త్య మెట్లగున్
గాధము బాహుదండముల కండువు మానెడిగాన మేలగున్
రూఢిని నీతఁడర్థిగ నమున్ భజియింపఁగ వీనికోర్కె న
ర్వ్యాథము గాకపోయెనని రోయుచునున్నది డెందమెంతయున్.

అది యెంతపనిగాని యిఁకగడుపొడవైన యీరేయి గడపు టకుగొప్పయత్నము గావింపవలయు.

విదూ:- కన్నులు మూసికొని యటనుండి యిటు నొక్కమూగు పొర్లు నంతలో బల్లున తెల్లవారు రాత్రికై యింతచింత యేల?

రాజు:- (నవ్వి) నీ కట్టులేగాని నాకన్ననో

చ. కడగి కనుంగవందెఱచి క్రమ్మరమూసిన యంతఁగాని యే
ర్పడదు నిమేషమొండవి సరాసరి యెన్నియొగూడ నొక్కటే
గడియ యనెన్నియో చనినఁ గల్గెడి రేయి యు నింతరాతిరిన్
గడపుటయెట్లొ! రేపకడ గాంచుటయెట్లొ? వచింపు మిత్రుఁడా

విదూ:- రాత్రికి దీర్ఘత్వము బాగుగా నుపపాదించితివి గాని, యిఁక దెల్లవారదనియే నీవుతలంచు చున్నాఁడవా?

రాజు:- (ఉత్కంఠతో)

ఉ. దీనస మాశ్రయించి యతిదీర్ఘనిశాటవి యెట్లొ దాటఁగా
నే మునిరేప భీమకృత నిర్మితమైన వివాహవేదికన్
భూమివచక్రమెల్ల వెలఁబోయి గనంగొన నోగచూపులన్
భీమజతోడ నొక్కమణిపీఠిక నెక్కుదు వేడ్కమీరఁగన్

విదూ:- దమయంతితో నొక్కపీఠము నెక్కుటేగాదు ఇఁకనామెతో సల్లాపమాడుచు నిదిసమయముగాదని పరిజనులతో సమముగా చారాయణునిఁగూడ దూరమున నుండఁబనుపుదువు.

రాజు: సఖుఁడా? పరిహాసము నాపుము, మనము శారదాదేవినిదర్శింతమా? లేక విదర్భరాజు రాక నిరీక్షించుచుందుదుమా?

విదూ:- ఇదియంతయు భగవతినే యడిగివత్తును. నీవు పరిజనులతోఁగూడ నిందె యుండుము. (అని యందఱుపోదురు)

దూత్యనిర్వహణ మను పంచమాంకము.

---

శ్రీ గురుభ్యోన్నమః

# నలవిలాసము

## షష్ఠాంకము

(దిక్పాలకులు ప్రవేశింతురు.)

మహేం:- మనము దమయంతికి నలునిచే పంపిన సందేశము వ్యర్థ మయ్యెఁగదా ? ఇఁక నేమి సేయవలయు ?

అగ్ని:- నలునివలన లోపము లేదు. ఆ యనఘుఁడు నిష్కల్మషము గనే తన దూత్యము నిర్వర్తించెను.

యముఁడు:- స్త్రీలే సాహసురాండ్రు. (అందును దమయంతి క్షత్ర జాతి. ఇఁక నెట్టులాంతునది చిత్తము సరస మగును ?

వరుణుఁడు:- 'యత్నే కృతే యదినసిధ్యది కోత్రదోషః' అను నీతినిఁ బట్టి యింకను దగునుపాయము బన్నవలయుఁ గాని యింతటితో నుపేక్షింపఁ గూడదు. ఏపనినైన నారంభించిన వెనుక నడు మన విడువరాదు గదా ?

మహేం:- మన మిఁకఁ జేయనగుపని నాలోచింపుఁడు.

అగ్ని:- మనము నల్వురము నలరూపములు దాల్చి స్వయంవర మండపమున నలునిప్రక్కన యుండుదము. అప్పుడు నిక్కువు నలుని దెలిసికొనఁజాలక మనలో నొక్కని వరించునేమో ?

యముఁడు:- ఈ యుపాయము బాగుగనే యున్నది.

వరుణు:- వచ్చితిమిగాన నదియుఁ జూడనలయుఁ గాని యంతమాత్ర మున మనయత్నము సిద్ధించునని యేను విశ్వసింపను.

స్వయంవర మండపము

రాజకుమారులు సింహాసనముల నధిష్ఠించి యుందురు. మహేంద్రాదులును నలరూపుదాల్చి నైషధునిప్రక్క సింహాసనముల మీఁద నుందురు.

నలుఁడు:- (తనలో చింతతో) కన్యక నన్నే వరించునని నమ్మక మున్నను నాడెందము సందేహించెడిని. ఏలన కార్యము సిద్ధించు నదనునఁగూడ దైవము విఘాతము గల్గించుఁగదా? ఏలన? ఏనట్లు దేవదూత్యము వహించి వెగటుగ నుడువుటను నటనుండక వెల్వడుటను భైమిని నిర్వేదమునొంది వేఱొక్కని వరించునో? తుదిదగు మనదశ నొందునో? లేక ఐహిక సుఖమున నాసక్తి వదలునో?

(తెరలో మంగళవాద్యము)

నలుఁడు:- అదిగో పెండ్లిపల్లకి నెక్కి నామదిజక్కవకు వెలకూన యగుభైమి వచ్చుచున్నది.

దమ:- (తనలో) పెక్కురాకుమారుల గడచినను నిషధ మహీపతి కానరాఁడయ్యెను. ఆయన నిప్పుముండై నిజనగరమునకరిగెనో లేక ఇట్లనున్నను, నపేక్షలేమిం జేసి మాఱురూపముననో తిరోహితుఁడయ్యో, యుండెనేమో? కానిమ్ము, ఈమండపమున నారాజచంద్రుఁడే లేనిపక్షమున బరివ్రాజకనయిన నగుదుఁగాని, యన్యుని వరింపఁజాలనుగదా? విప్రోత్తమా? యింకను రాజపుత్రులెందఱున్నారు?

భారతి:- కుమారీ! ఈ రాజచంద్రునింగనుము

చ. అధిపతి పాండ్యదేశముల కగ్గ్యుఁడు రూపసులం బవిత్రమా
మధురపురంబు నేలు బుధమాన్యుఁ డనంతపరాక్రమక్రమ
ప్రథితయశుండు సర్వనరపాల నుతుండు రిపుంజయాఖ్యుఁడో
నిధిపతిమిత్రుపౌత్రుఁడు వినీతుఁడు వీనిఁబరిగ్రహింపుమీ

దమ:- ఇతఁడు నన్నుఁగని తలవాంచుచున్నాఁడు పోనిమ్ము.

భారతి:- రాజముఖీ! యీ మహారాజుముఖ్యుం గనుము.

ఉ. ఇజ్జగమందు సంపదలనెంతయు సొంపుజలిర్చునట్టిదా
నుజ్జయినీపురీశుఁడు మహోజ్వలతేజుఁ డుదాత్తధీరుఁడుఁ
సజ్జనతాపరిష్టితుఁడు సజ్జన నిగ్రహణుండు రూప సం
పజ్జిత కామకామిని ప్రభాకరనాము వివాహమాడుమీ

దమ:- ఇతఁడు నన్నుఁజూచి వడకుచున్నాఁడు. ఉండనిమ్ము.

భారతి:- వేఱొకనిం జూపి,

ఉ. కాంచిపురాధినాయకు నఖండితతేజు నుదగ్రవైభవో
దంచితచోళమండలరమాధిపు నుష్ణకరప్రతాపు ని
ర్వంచనధర్మ రూపపరివంచిత కుంచితపంచనాయకుఁ
గాంచనగౌరగాత్రు పరకాలుని పాణిఁ బరిగ్రహింపుమీ?

దమ:-ఇతఁ డేదేనొక చిత్రపటముం గనుచు జెక్కులినుండి దొరఁగు
చెమటబొట్టులను వస్త్రఖండముతో తుడుచుకొను చున్నాఁడు
కానిమ్ము.

భారతి:- వత్సా! యితఁడే నైషధుఁడు చూడుము.

దమ:- (లజ్జించుచు బూదండ నెత్తుచుండును)

భారతి:- (ఎత్తిన మాలికఁ దనచేతితో నాపి) భైమీ! వీఁడుగాక
మఱియింకను నల్వురు నలురున్నారు ఈ యేవురలో నిజమైన
నలుఁడెవ్వఁడో యేర్పడుదనుక నాగుము.

దమ:- (విచారముతో జూచుచుండును)

దిక్పతులు:- ఇదిగో నాయిక మనయొద్దకే వచ్చినది కానీ ఇఁక నలు
నెటుకనిపెటునో చూతము (అని చూచుచుందురు)

భారతి:-

తే. గీ. ఖేదితాऽశేష వసుమతీ భృత్కులీను
సధర తరలోచ నాంబుజాతాऽభిరాము
నూర్జితోద్భట వీరసేనోదయార్య
భువి మహేంద్రుని జూడుమో పువ్వుఁబోడి.

భారతి:- (వారిలో వేఱొకనిం జూపి)

తే. గీ. భాస్వరాऽద్భుతరూప సంపత్తిశాలి
పావననిసర్గు భస్మితస్వైరివర్గు
ప్రథిత తేజస్వ్యనీక మహాబలసహాయు
నతివ! కనుఁగొను మేర్పడ నితఁడ నలుఁడు.

భారతి:- (మఱియొక్కనిఁ జూపి)

తే. గీ. పుణ్యకీర్తియనవశేష బోధమూర్తి
దళితవిబుధార్తి సమవర్తి ధర్మమూర్తి!
చారువిస్ఫూర్తి దాక్షిణ్యచక్రవర్తి
నితనిఁ గనుఁగొను మత్తగజేంద్రగమన!

భారతి:- (ఇంక నొక్కనిఁ జూపి)

తే. గీ. అబ్ధిగాంభీర్యు భువనరక్షైకధుర్యు
హంసమాను నదీను నాహతకృశాను
మహితజన్ము సమాశ్రితతుహినభానుఁ
గాంత! వరియింపు మాశ్రితకామధేను.

దమ:- (తనలో) ఆహా! యీ యేవురును ప్రాయము, రూపము, కాంతి యన్నిటను నొక్క తీరుగలిగి వేఱుపరుప నలవి గాకుండ నున్నారు. ఇది కనుచూపు వికారమో మన్మథ మాయయో విరహమువలని నలభ్రాంతియో, నలుని విశ్వ

రూపమో, వేల్పుల కపటనాటకమో. అట్లు గాక వీరొక్క రొకరు నల జయంత వసంతాశ్వినీ దేవతలో ఇది యెట్లను దేవమాయగన తోఁచెడినిగాన ప్రసాదింప వారినే ప్రణుతింతును గాక (ఆలోచించి) వారు నన్నెట్టు లనుగ్రహింతురు? దిక్పతులమతులు మీాన కేతనుని శోషణబాణముచే నిశ్శేషముగఁ బీల్చబడిన దయారసము గల గోతులుగదా! కాన వీరు నాకుఁ బ్రియదానము గావింతు రనుట కల్ల, కాఁబట్టి యేన వీరిలో దేవమానవ విశేషము గనిపట్టుదును గాక అని యా యేవురను నెమ్మదిగాఁ జూచుచుండునుఁ.

దమ:- ఔరా! యీా యేవురలో మొదటి నల్వురకును అడుగుదమ్ములు నేలఁదాకవు. మోముచందురులు చెమర్పవు. ఎడదలోనే పూలదండలు వాడ్పునొందవు. కనురెప్పలు వ్రాలవు కాన వీరు దిక్పాలురు ఈ గుర్తు లెంతయు లేని ఏనవవాఁడే నామనోహరుఁడగు నైషధుఁడు. [అని తలంచుచు కటాక్షములు మదనలజ్జాభరంబులకు లోనయి నైషధుని డాయను, బాయనుఁజాలక యాడుచుండ నెట్టకేలకు మరలించి భారతీదేవి ముఖచంద్రునిపై నిల్పును.]

నలుఁడు:- (తనలో) ఆహా! యిదియేమి? గంటిపైఁ గారముపడినది. ఏమన, భైమి సమీాపించెనుగాని, దిక్పాలురు నా వేషము దాల్చి యున్నారుగదా! నేనును నిక్కపు నలుఁడను గానని తలంచి తొలఁగిపోవునేమో? ఈశ్వరేచ్ఛ యెటులున్నదో?

దమ:- (ప్రణమిల్లి) నేను త్రికరణశుద్ధిగా నిషధేశునినే జీవితేశునిఁగా నమ్మి యుంటినేనియు; చతుర్ముఖుఁడు నాజన్మము సార్థకముగావింపఁ దలచెనేనియు, పార్వతీపరమేశ్వరులు నాయందు దయగలవారేనియు, నీ పూదండ నిషధనాథుని గళనాళమునవే పడుగాక. [అని మాలిక నునుచును. పూదండ నలునికంఠమునవే పడును.]

(తెరలో)

(పుష్పవర్షము, మంగళగానము, మృదంగధ్వనియు ప్రవర్తించును)

దిక్పతులు:- (తమలో) ఔరా! బుద్ధిశాలిని మమ్ము గెలిచెను. పరమేశ్వరాజ్ఞ మీఱరాదు. చింతిల్లిన లాభము లేదు. (ప్రకాశముగా) నాట్యములో నిజరూపములు దాల్చి, శుభవతీ, మేలయ్యెను. ప్రతిన చెల్లించుకొంటివి. నీకు నలుఁడే తగినవాఁడు. అతఁడు మమ్ముల గారవించెను, నీవు ధన్యురాలవు. కలువ తీగ చందురునేగాక వేరొకని మెచ్చునా?

రాజులు:- ఆహా! దమయంతి బుద్ధికౌశలత నేమనవలయు!

దమ:- (తనలో, సంతోషములో) నాకు మనోహరుఁడు లభించెను. పరమేశ్వరా! ఇది నీ యనుగ్రహము. పరమేష్ఠీ! నీవు నన్ను బుట్టించుట సఫలమయ్యెను. మదనా! నీ యుద్యమము కృతార్థమయ్యెను. (ప్రకాశముగా, లజ్జించుచుండును.)

నలుఁడు:- (హర్షములో, తనలో) అబ్బా! జన్మ సఫలమయ్యెను. (ఆశ్చర్యములో) దైవవిలాస మెంతచిత్రము; భైమిదగు బుద్ధికౌశలత యెట్టిది? నా భాగ్యమేమి? మనఃప్రియ లభించెను. దిక్పతులను నేలమీఁద దర్శించితిని. (విషాదములో) అయ్యో! పెద్దల యభీష్టము దీర్పజాలనైతిని. ఇఁక దైవకృతమునకై వగచిన లాభమేమి. (ప్రకాశముగా, లజ్జ నటించు చుండును.)

దిక్పాలురు:- (నలునుద్దేశించి సశ్లాఘముగా) నిషధేశా! డెందమునఁ జింత విడువుము. ఏము మెచ్చితిమి. జగమున నెప్పటికైన నిజమే గెలుచును. శ్రీదేవివోలె గుణానురాగిని యగు దమయంతినిఁగూడి దీర్ఘాయుష్మంతుఁడవై పుడమి బాలింపుము)

రాజులు:- (చేతులు పైకెత్తి బిగ్గరఁగా) విశ్వంభరా చక్రమున కెల్లను జక్రవర్తి యగు శ్రీ నలమహారాజు దమయంతితో గూడ విజయ మందుగాక.

'యకుఁడు:- పెద్దలచే ననుగ్రహింపఁ బడితిని. (అని నమస్కరించును.)

మయంతి:- దేవతలచే ననుగ్రహింపఁబడితిని. (అని నమస్కరించును)

ఋత్విజులు:- రాజేంద్రా! నీవివయమున మెచ్చిన మాప్రసాద మెట్టి
దన నీచేయు జన్నములలో దేవేంద్రుఁడు హవిస్సును ప్రత్య
క్షముగా గ్రహించెడిని! నీకు వలసినచోట నీరు నివ్వ వాడ
మెడిని. నీకెల్లపుడును ధర్మబుద్ధి చలింపకుండునది. నీకుఁ
గుబేరునికన్న మిన్నయగు సంపన్నత గల్గియుండుగాక.
చక్రవర్తీ! మాకు సెలవొసంగుము.

తెరలో

ఆర్యమిత్రులారా! మీరందఱును గన్నియకుఁ బాణిగ్రహ
ణము నెఱవేఱునమక నిందుండి యనుగ్రహింపవలయునని
మీదర్శనముచేఁ గృతార్థుఁడగు భీముని విన్నపము.

ఒందఱు:- మేలు. ఆస్థానికిఁ బోవుదము.

వసుదేవుఁడు:- సార్వభౌమా! మహారాజ కన్నియను చేతితోఁ
బట్టుకొనుగాక.

నాయకుఁడు:- మీ యాజ్ఞ. (యని దమయంతిని చేతితోఁ బట్టుకొని)
(తనలో) మహాసముద్రము దాటితిమి. ముక్తామణిఁ జిక్కెను.
కృతకృత్యులమైతిమి. బ్రాహ్మణోత్తమా! నమస్కారము.
(అని నమస్కరించును)

(తిరిగి వసుదేవుఁడు)

ఉ. హైమవతీకరాబ్జము చరాచర జుష్టవివాహవేదికన్
సోమధరుండు గైకొని ప్రసూనశరుం బ్రదికించినట్లుగా
శైమిని పెండ్లియాడి నరపాలురకబ్బెదురం నలుండెసన్
గామితసిద్ధి జొప్పడు సఖండ ముదంబుధి నోలలాడెడిన్.

దమదేవుఁడు:- (నలమహారాజును జూచి) నీకిఁక కావలసిన దేమి కలదు?

నలు:-

చ. ఒదవిన యంతరాయ కపటోదధిజాలము లెల్ల దాటితిన్
త్రిదశవరార్చ్యమాన సదతీమణిపాణిఁ బరిగ్రహించితిన్
మదమితరానవద్యము సమున్నతి మీఱఁగ నందఁగల్గితిన్
గొదవ యొకింతలేదు ఇఁక మీఁద దలంగల కేల్వసత్కృపన్.

అయినను భరతవాక్య మిది యుండుఁగాక.

చ. పుడమి దెలంగుఁగాక సిరిపూరితకామ జనాభిరామ మై
యొడయలు బ్రోచుచుండుత నయోన్నతి మీఱక మానవాళి నె
ప్పుడు మనుచుండ్రుతన్ గవు లపూర్వకృతి గ్రథనైకశీలురై
యుడుపతి మౌళినే గొలుచుచుందురు గాక ముముక్షు లెల్లరున్.

స్వయంవరమను షష్ఠాంకము సంపూర్ణము

